# ఖండకావ్యము

మొదటి భాగము

రచయిత
కవికోకిల, కవితావిశారద, ఉభయభాషా ప్రవీణ
జి జాషువ కవి

పబ్లిషర్సు:
వేంకట్రామ అండ్ కో.,
హెడ్డాఫీసు:—బెజవాడ

# అంకితము

శ్రీమదాత్రేయగోత్రీయుఁ డార్వేలని
యోగి భూసురుఁడు గుంటూరువాసి
ఏకాన్వవాయంబు హీరహారమునందు
వెలుగొందు నురవైన కొలికిపూస
దానంబులోఁ గ్రొత్తదారిఁ ద్రొక్కి-నదాత
ఆడంబరము లేని న్యాయవాది
కులమువారలు పెంచుకొను ప్రతిష్ఠాభర్మ
హంసి కాయువుఁ బోసినట్టి ఘనుఁడు

వసుధ గ్రుంగినఁ బట్టినపట్టు విడని
ఆధునిక భగీరథుఁడు దండార్యమౌళి
అట్టిప్రాజ్ఞునిజనయిత్రి కంకితమయి
నాకవిత్వంబు చిన్నారినవ్వు నవ్వె.

# విషయసూచిక

# విజ్ఞప్తి

పఠితృమహాశయులకు—

తెలుఁగుపత్రికలకుఁ బలమానికమైన భారతి నోఁగాడ నేర్చిన నాఁటఁగోలెఁ బ్రౌఢయై, వలపులూరఁ బలుక నేర్చిన నేఁటివఱకు మేను మోసిన పద్యన్యాసములే నేటి కీగ్రంథరూపమును దాల్చినవి. ఇంకలిపద్యములలో విశేష భాగ మింతకుముందే రసపిపాసువులపరిచయమునకుఁ బాత్రములగుట నాభాగ్యముగాని వేఱు గాదు. పత్రికాముఖమున నన్నెఱిఁగినసహృదయులు లేఖాముఖమున నాకుఁ జూపునాదరాభిమానముల నరసి, 'భాషాభిమానము తెలుఁగునాఁటఁ జావలేదు. నాజన్మము ధన్యమైన'దని సమ్మదాశ్రువులు దాల్చుచు, ధనాభావముననిరంతరముఁ గుమిలిపోవునాయాత్మ కూఱటఁ గల్పించుకొనుచుందును

ఈ సందర్భమున 'ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా' యన్న చేమకూరి వేంకటకవిమాట నించుక యనాదరింపవలసివచ్చినందునఁ బ్రాజ్ఞులు మన్నింతురుగాక నే నేగతి రచియింతునో చెప్పఁజాలనుగాని, సమకాలీనులవాత్సల్యమునకు గుఱియైతినని చెప్పికొనుపుణ్యము నాకుఁ గల్పించిన తెలుఁగువారికి నేను కృతజ్ఞుఁడను. ఎవరో యొకరిద్దరు బుద్ధిమంతులమాట నిటఁ దడవనేల ?

శ్రేయమునకు విఘ్నములు మిక్కుటముగదా ? ఈ గ్రంథమున కంతరాయము లెన్నో కలిగినవి. నేఁడు తొలఁ

గినవి. నా రచనలు తెలుఁగుపాలమున నీషన్మాత్రమైనను జైతన్యమును గలిగింపఁజాలినచో, నా కింక నేమి కావల యును ? "గడనకెక్కినయాంధ్రపుత్రుఁడను నేను" "మడమ ద్రిప్పనియాంధ్రవీరుఁడను నేను" అని వాకొన్న నాగీతము, నావాణి, శాశ్వతకీర్తిని నాకు సమకూర్పఁగలదు. నిరతిశయా నందసామ్రాజ్యమున కధినేత నయ్యెదను

మఱొక మనవి. ఇందలి పద్యములు, భావములు, జాతీయము లందందుఁ గవికుమారులు తమ వ్రాఁతలలోఁ బ్రయోగించుకొనుచున్నారు. తొలుతనుండి నా రచనలు భారతిం దిలకించురసజ్ఞు లందలి ముందువెనుకలను గమనించి, సత్యమును నిర్ధారింతురుగాక. నిర్భరానందమున నే నీకృతిని బరిచితాంధ్రలోకమునకు సమర్పించుకొనుచున్నాను. దీని నెన్ని భాగములుగా నరసి యానందింపఁగలదో నా తెలుఁగు తల్లి, భారము తనదిగాని నాది గాదు భిన్నభిన్న శీర్షికలు గల నాయీకావ్యకుసుమదళములను గుత్తిగట్టి తనజననిజన కుల కంకిత మిప్పించి సరస్వతికొప్పున నుంచు నవకాశముఁ గల్పించిన ప్రాడ్వివాకశిరోమణులును, గుప్తదానశౌండులును గుంటూరువాస్తవ్యులు నగు మ. రా. శ్రీ ఏకా దండయ్య పంతులుగారికి నమస్కారములు.

గ్రంథకర్త.

---

# ఖండకావ్యము

## మొదటి భాగము

### 1. భరతమాత

సగరమాంధాతాది షట్చక్రవర్తుల
యంకసీమల నిల్చినట్టి సాధ్వి
కమలనాభుని వేణుగానసుధాంబుధి
మునిఁగి తేలినపరిపూతదేహ
కాళిదాసాదిసత్కవికుమారులఁ గాంచి
కీర్తినందినపెద్దగేస్తురాలు
బుద్ధాదిమునిజనంబులతపంబున మోద
బాష్పము ల్విడిచిన భక్తురాలు

సింధుగంగానదీజలక్షీర మెపుడుఁ
గురిసి బిడ్డలఁ బోషించుకొనుచు నున్న
పచ్చి బాలెంతరాలు మా భరతమాత
మాతలకు మాత, సకలసంపత్సమేత.

## 2. కృతిస్వామినీ ప్రశంస

శ్రీయేకాన్వయరత్న భూషణము, లక్ష్మీసుప్రసన్నేక్షణ
చ్ఛాయాభాసితుఁ డైనదండయను భాషాపోషకుం బున్నెముల్
బూయన్ గాంచినరుక్మిణీసతి నెదం బూజించి, యే నంకితం
బీయం బూనితి నస్మదీయకృతి బ్రాహ్మీదేవతాప్రీతిగన్. ౧

ఏ లోకంబున నుంటివో, సుగుణవల్లీ! రుక్మిణీదేవి! యిం
దాలంబం బిసుమంత లేనికృతికన్యాజాలముం బ్రేముడిం
బాలింపంగలపుత్రరత్నమును సంపన్నుం బ్రసాదించినా
వీలోకానకు, నీఋణగ్రసిత మయ్యెన్ దెల్గుసాహిత్యమున్. ౨

మును నీవిచ్చుటనిల్చిపోయినయశోమూర్తిం బ్రపూజించి, యీ
తెనుఁగుంగబ్బము ఖండగీతికలు భక్తిన్ నీకు నర్పించితిన్
వనితాలోకవిలాసభూషణమ! సుబ్రహ్మణ్యనిల్లాల! చ
క్కనినీదివ్యచరిత్ర మత్కృతికి బంగారునీరు వోయుంచుతన్. ౩

విను వాక్కింతయు లేక నాథునిమనోవీధిం బ్రవర్తించి, సా
రసనేత్రాసముదాయనిర్మలశిరోరత్నంబు నాఁ గీర్తి పె
ల్లెసఁగన్ డెబ్బదినాలుగేండ్లు మని, ప్రాణేశాంఘ్రిపద్మస్థలిన్
బసుపుం గుంకుమతో గతించితివి నీభాగ్యంబు సామాన్యమే!

ఒకనాఁడు నీచంకనుండి నీముద్దుల
జలకంబులాడిన చంటివాఁడు
ఒకనాఁడు నీపెట్టునోగిరంబు భుజింప
మారాము చేయు బంగారుకొండ

ఒకనాఁడు నీచిత్తమూఁగ 'నమ్మా' యని
పలుకరించిన నీదు భాగ్యరాశి
ఒకనాఁడు నీదేహ మువ్వాంగ నలనల్ల
నుడువ నేరిచికొన్న కడుపుఁబంట

దండయామాగ్రణి, నీకూర్మితనుభవుఁడు
ఖండకావ్యంబు కృతిని నఖండభక్తి
నంకితంబుగ నిప్పించె నందికొనుము
తనువు పులకింప, హస్తపద్మములు సాఁచి. ౫

గెలనా! నీతనుజన్ముతోఁడ సహపంక్తిఁ బంచభక్ష్యాలతో
గలమాన్నంబు భుజించుబాలకులమూకం జూతువో! వారు పే
దలు, విద్యార్థులు, కట్టుఁబుట్టములు విత్తం బిచ్చి పోషించి, దా
తలలో దాత యనం బ్రసిద్ధి వడసెన్ దల్లి! సుతుం డిద్ధరన్. ౬

సంపాదించినవిత్తము
సంపాదన మాని సకలసత్కర్మల వె
చ్చింపం బూనినదండయ
పెంపుం దెగువయును గల యభిజ్ఞులు గలరే ? ౭

కల కొక్కించుక పలుకుల
మెఱుపు నలెం దోఁచుఁగాని మెత్తనివెన్నఁ
దిరిసెనపుఁబూలగుత్తిం
దొరయుమిన్నసుతునిహృదయతో యజ నబలా! ౮

ముచ్చట సెప్పఁజూచో నడుగఁ బోయినవాని హృదంతరాళమం
దిచ్చునో, యీయఁడో, యనియొకింతక సంశయమంకురించుఁ దా

నిచ్చిన నేన్గుపాడియసుమీ' తినువాని లలాటరేఖలోఁ
బొచ్చెముగాక, నీసుతునిఁబోలు వదాన్యులు లేరు మానినీ'

ఊరక వెట్టిగా నొసఁగి యుక్తమయుక్తమనాక, పేరుకై
శారలు సాఁచఁ డన్నిట శుభంబని తోఁచినఁగాక, యిచ్చుచో
నేరివియుఁ జిఫారసు లోకింతయు గిట్టవు, రుక్మిణమ్మ! యే
తీరుసఁ గంటి, విట్టి యొరదీసినకర్తిని, భక్తసత్తముఁ ? ౧౦

రేయింబవ లొరులకు మే
ల్సేయవలయు ననెడు నమలచింతయకాపీ
నీయాత్మజునకు మఱి వే
రే యోచన లేదు శర్వరీనాథముఖీ! ౧౧

కొమరుని ధర్మకార్యముల పోషణమున
మొలిచె, మేల్కొరితి మొగలితోఁట
సుతుఁడు గట్టించుప్రోన్నతసత్రశాలల
మొరసె యాత్రికులకిన్నెరలవినుతి
తనయుండు ద్రవ్వించు ఘనతటాకములలోఁ
జెలఁగె, బేడిసమీలచెంగనాలు
తనుజుండు నెఱపు సంతర్పణంబులలోన
నిండెఁ బేదలకేల నేతిజిడ్డు

నందనుని వదాన్యత రంగనాథు నెదుటఁ
బహరితోఁగూడ నొకమంటపంబు మొలిచె
దైవభక్తుల పెనుజాబితాలయందు
ప్రథమమునఁ జేరె నీకన్నవాని పేరు ౧౨

తనజన్మస్థలిఁ బ్రత్తిపాటిపురి సత్రం బొండు గట్టించి, బా
విని ద్రవ్వించి, పురాణముల్ జరుప నుర్వీనిర్జరశ్రేష్ఠు నొ
క్కని నిల్పె న్నెలజీత మిచ్చి, ఘనభక్తశ్రేణి దండాభిధా
నుని గీర్తింతు రనారతంబు, నది నిన్నుల్ ధన్యుఁ గావింపదో?

సమదృష్టి నేత్రయుగమున
సముద్భవము నంద నిత్యసత్య వ్రతుఁడై
కొమరారుసుతునిశిరమున
నమరులతోఁ గురియు మమ్మ యాశీస్సుమముల్ ౧౪

కులశీలరూపగుణముల
కీలాపమగు రుక్మిణమ్మగారి సరస ని
మ్ముల నేగతి మెలఁగెదో! యొ
వ్వాలకుప్పా! నాదుకబ్బపుంగ్రొమ్ములకా! ౧౫

పతికి సతి, సతికిఁ బతి యను
నితాంతధర్మంబుఁ గలఁచి నీకొమరుఁడు నీ
పతి నిటువలె నారెండవ
కృతిపతిఁ గావించె, మోదమేకద నీకున్! ౧౬

మేలిగుణాలకుం బసిఁడిమేడ, దయాపరురాలు, దొడ్డయి
ల్లాలు, కుమారమానవిభవాఢ్యులఁ గాంచినచల్లనమ్మ, స్వ
ర్గాలయరత్నదీప మయి యంబరవీథుల నాడు రుక్మిణీ
శీలవతీలలామగళసీమకు మత్కృతి జాజిదండయా. ౧౭

సువినీతుండగు నీదుకూరిమితనూజుం, డార్ద్రచిత్తుండు, భూ
దివిజశ్రేష్ఠుఁడు, దండయాభిధుఁడు, ముద్రింపించినాఁడమ్మ, రెం

డవపర్యాయము ఖండకావ్యకృతి నానందించు నీవేల్పుబం
దువు లగ్గింప ధరింపుమమ్మ! గళమందున్ రుక్మిణీగేహినీ! ౧౮

కట్టించెన్ వ్యయ మిఁగ్గణింపక, సభాగారంబుఁ గీర్తిద్యుతుల్
మిట్టాడన్ మొనమొన్న గుంటురఁ గళాలీలానివాసంబుగాఁ
బట్టుందీక్షయు, దూరదృష్టియు, ననల్పత్యాగముం గల్గు నీ
పట్టిం జూచి తెలుంగుకాశ్యపి సగర్వస్ఫూర్తి శోభిల్లెడిన్. ౧౯

---

## 3. గిజిగాఁడు

జిలుగుంబంగరురంగులం గులుకుమేల్చిన్నారిపూగుత్తిసో
మ్ములు గీలించినతుమ్మకొమ్మలకు నీవు న్నీసతీరత్న మూ
యెలగీమున్ దగిలించి రేఁబవలు హాయిం దూఁగరా, గాడ్పుబి
డ్డలు మీ కూడిగమాచరింప, గిజిగాఁడా! నీకు దీర్ఘాయు వౌ.

తేలిక గడ్డిపోఁచలను దెచ్చి, రచించెద వీవు తూఁగుటు
య్యేలగృహంబు, మానవుల కేరికి సాధ్యముగాదు, దానిలో
జాలరు, లందులో జిలుఁగుశయ్యలు, నంతిపురంబు లొప్పఁగా
మేలు భళీ! పులుగుటెకిమీఁడవురా గిజిగాఁడ! నీకహా! ౨

కులుకుపసిండినిగ్గులదుకూలములన్ ధరియించి, ముద్దు బి
డ్డలును, బడంతి, పొదిగిట నిద్దురింపఁగఁ, గన్నెగాడ్పులూ
యెలసదనంబునూఁచ, భయమింతయెఱుంగకకన్నుమూయు,నీ
యల్లఘుసుఖంబు మాకుఁగలదా? గిజిగా! యొకరేనికున్నదా?

అందమున నీకు నీడగు నంచగాఁడు
గృహావినిర్మాణమున నిన్ను గెలుచువాఁడు
వైభవంబునఁ బోలు దేవతల జేఁడు
లేఁడురా, గిజిగా! మొనగాఁడ వోయి! ర

నీ గిజిగానినామకీము, నీ తెలివిం బ్రకటించు గూడు నీ
మెఁగలసోయగం, బవని మానవకోటికి ముద్దుసేయు నో
యీ! గిజిగాఁడ! భతిలకు మీవు ధరాతలి నున్న బిట్టుగా
వాగెదునా సికు లలలు వంతు రనంతుని చెంత ఖిన్నలై. ౫

## 4. సాలీఁడు

నీలో నూలు తయారుజేయుమర గానీ, ప్రత్తిరాట్నంబు గా
నీ, లే, దీశ్వరశక్తి నీ కడుపులోనే లీనమై యుండునో,
యేలీలన్ రచియింతు వీజిలుఁగునూ, లీపట్టు పుట్టంబు లో
సాలీఁడా! నిను మోసగాఁడవని విశ్వం బేల దూషించెడిన్?

ఘకా్య మల్లుపసందు నేతపనివాంఢ్రా, నీయువాధ్యాయు? లి
ష్ట్రాకృఎందున్ గనరాఁడు, డాఁగుకొనినారో? నీదుగర్భంబునం
దికాలంబున నిన్ను మించుపనివాఁడే లేఁడు, దుర్వృత్తికిన్
దీక్కై, నీయసమానకౌశలము వ్యర్థీభూతమై పోయెడిన్. ౧

పురువుంగుంపును మోసపుచ్చుటకుఁగాబో ల్గొంగముగ్గాలపై
మురిపెంపుంబని యుల్లిపట్టువలిపంబుల్ నేసి, నిమందిరాం

తర దేశంబున నారఁగట్టి యొకపొంతం బొంచినా, వోరి ట
క్కరి! పాలీఁడవు గావు, దొంగవని వక్కాణింపవే లోకముల్?

తలఁపం బున్నమనాటివెన్నెలల దిద్దంజాలు నీసూలు పో
గులసింగారముఁ జూడవచ్చి, యసువుల్గోల్పోవ యెడిఁ బ్రాణు,లో
తులువా! నెత్తురు ద్రావునేఁతపను లెందుం జూడ మోరంతప్రొ
ద్దులు నీ కీయుదరంభరిత్వ మనుకొందుం బెండ్లముం బిడ్డలున్.

ఒకపర్యాయము, కాందిశీకుఁ డగువీరోత్తంస మొక్కండుకొం
డకు నీ పల్లినగూటియం దొదిగియుండఁగ దాయ లేతెంచి, నీ
మొకమోటంబున నమ్మినీదునిలయంబుఁ దొంగియుంజూడ రిం
దుకు నిన్నుం గొనియాడి, యీశ్వరుని వైదుష్యంబు
[నూహించెదన్

## 5. నెలబాలుఁడు

గగనకల్యాణి గండభాగమున నిద్ర
కాలపురుషుని గురునఖక్షతముఁబోలి
మంచునవ్వుల నదె చందమామబుడుత
జననమైనాఁడు పశ్చిమశైలశిఖరి. ౧

నిండుపున్నమనాటి కీసీటు కాఁడు
కళలు పదియారు నేరిచి గర్వపడును
అమరులు భుజింతు రితని దేహమును గమిచి
యమవసకుఁ గానరాఁ డీతఁ డల్పజీవి. ౨

కుముదము తేనెతో నెదురుకొన్నది పూజకు, చందమామ యం
దము గలవాఁడు చుట్టమని నాలుగుదిక్కులనుండి సర్వలో
కము తలయెత్తి పిల్లనెలగానికి వందన మాచరించె, సాం
ద్రము లగునీనిచూపు లమృతంబును జిందును శీతలంబులై. 3

చుక్కపోలంతి నీకొఱకు స్రుక్కుచునున్న దమాసనుండి కెం
పెక్కకన్ను మూసికొనియెం గుముదంబు, నిశావధూటి, నీ
చిక్కనిమంచు వెన్నెల భుజించుచకోరము కంటినీరు న
ద్దిక్కులఁ జిమ్ముచున్నది మదించి జగంబున్రమింగెఁ జీఁకటుల్.

పున్నమనాఁడు నీవు పరిపూర్ణ శరీరుఁడవై, సుధావిలా
సోన్నతి నవ్వుచుం బొడముచుందువు లోకము సంతసింప నో
క్రొన్నెలబాల! యారుపదిరోజులజీవికి నవ్వు వచ్చునే?
యన్నము వట్టునే? పరహితార్థివి నీకు విచార మున్నదే? ౫

అదిగో! సింహికపట్టి నీ తెరవునం దడ్డంబుగా నిల్చి, నీ
రదకుంజంబున నక్కినాఁడతనిదంష్ట్రల్ గ్రూరముల్ సుమ్ము, నీ
మృదుదేహంబును గాసిపెట్టుకొని యిక్లైన్నాళ్ళు లోలోనఁగ్రు
శ్శెద వన్నా! ధరణీహితార్థము నిశాలీలావతీవల్లభా! ౬



## 6. నెమిలినెలఁత

తలపైఁ గల్కితురాయి, కంఠమున నిద్దాతళ్కుఁగ్రొమ్మొల్కప
చ్చలహారంబు ధరించి, కాటుకవిలాసం బొప్పు వాల్గంటితె
ప్పల నానందము నిండ, నర్తితనిజప్రాణేశ్వరుం జూచు, నె
మ్మిలరాణీ! యిటు చూడవే నుతిశతంబుల్ నీకు నీభర్తకున్.

పొన్నుంగన్నులు నెత్తి కేకఁ గులికింపుం గంఠగర్వంబునన్
నిన్నున్ నీచెలికత్తెలం బ్రణయకంధి న్ముంచి తేలింప, నీ
సాన్నిధ్యంబున నాట్యమాడుపతిపజ్జన్ బారవశ్యంబునన్
గన్నుల్ మోడ్తువు నిచ్చలున్నెమిలిచానా! యెంతపుణ్యాత్మవో.

కోరినపాపటోగిరముఁ గూరిచి నీమది పల్లవింపఁ జి
న్నారిమనోజ్ఞషడ్జమనినాదముల న్నిను బుజ్జగించు, బం
గారపుఁగంటికుల్కుల మగండు మహేంద్రునియంతవాఁడు, నీ
చేరువ నాడెడి న్నెమిలిచేడియ! నీకుఁ గొఱంత గల్గునే! ౩

ఉఱుము లెసెం, దళుక్కుమనుచున్నది మించను మోసకత్తె, యం
బరమున మబ్బు తేలినవి, మంజుల కేంకృతు లొప్ప నీమనో
హరుఁ డురుపింఛదీధితుల నారతు లీయఁ దొడంగెఁ, గేకిసుం
దరి! పొదరిండ్ల తీవెపరదాలమఱుంగునఁ జెంగలింపవే! ౪

భర్త హొంబట్టుజిలుఁగు టంబరము దాల్చి
విపినవీథులలోఁ దాండవించుచుండఁ
జేరువను నిల్చి మాసినచీరఁగట్టి
మురిసికొనుపతివ్రతవు సుందరులలోన. ౫

# తుమ్మెద పెండ్లికొడుకు

కొండల నందుగుంజగురుఁగొమ్మలు మేసి మదించు భద్ర వే
దండకపోలదానజలధారలఁ దానము లాడఁబోయి, యు
ద్దండకరోరకర్ణములు దాఁకిన మూర్ఛిలితో! మరేల రా
కుండెద? నీ విలంబనము నోర్చునె? తేఁటిపడంతి, షట్పదా! ౧

కూరిమి పల్లవింప నదిగో సుదతీమణు లెల్ల నీముఖాం
భోరుహదర్శనార్థమయి పుప్పొడిపుట్టములన్ ధరించి, కా
సారనికేతనాంగణవిశాలతలంబుల విశ్రమించి యు
న్నా, రిఁక రాకయున్న దహనంబునఁ గ్రుంకెద రోయిషట్పదా!

కాకులు కూసినంతన, యెకాయెకి నిద్దురనుండి లేచి, మా
ధ్వీకము దొంగిలింపఁ బరువెత్తితి; వబ్జహితుండు క్రుంకునం
దాఁక, సుధాధనాపహరణం బొనరించెద వేలనోయి! నా
ళీకవనంబు కన్ను ముకుళించిన నీగతి యేమి? షట్పదా!

తమ్ములచుట్టమస్తగిరి దాఁగె, మృగాంకుఁడు తూర్పుకొండనె
త్తమ్ముల కెక్కె, చిక్కని సుధారసభుక్తిఁ జకోరబంధుబృం
దమ్ముల కిచ్చె, నింతవరదాఁక గృహమ్ముఁ దలంపవేల? నీ
తుమ్మెదపెండ్లికూఁతుల నెదుర్కొన రాఁగదవోయి, షట్పదా!

పూవులు దాఁచుకొన్నమధువుం దనివోవఁగఁ గ్రోలి, యింటికిం
దేవలె నన్న యాస, నలుదిక్కుల కెక్కెడు నీచరిత్రయం
దేవ జనించి, పద్మవనమెల్ల మొగంబు మరల్చె, నిట్టి తృ
ష్ణావిలబుద్ధి, తమ్మిచెలి కంపకపోవదు నిన్ను షట్పదా! ౫

మొన్న వివాహ మాడితివి, ముద్దుపడంతులఁ, బెండ్లియైనయం
త, న్నవ మల్లికామధునదంబులఁ జొచ్చితి, వెంతకాలమీ
క్రొన్ననతీవె జొంపములఁ గూతలువెట్టెద? వింకనైన రా
కుసన్న, జగంబు మెచ్చదనియుం దలపోయ విదేల? షట్పదా!

బంగరుపూవుటిండ్లతలవాకిలిఁ ద్రొక్కనిబిచ్చగాని, ని
న్నుం గని నవ్వుచుండు సుమనోనిచయం, బిది యేటివింత? నీ
యంగన కంఠమం దలరదా? యలనాటి సువర్ణసూత్ర మో
భృంగకుమారకా! కుదువఁ బెట్టవుగా? మధుమద్యపాయివై.

## 8 దీర్ఘనిశ్వాసము

తెలుఁగుంబాసకు వన్నె దెచ్చినజగద్వీరుండు, మాకృష్ణరా
యలు గట్టించినవజ్రదుర్గముల, శుద్ధాంతప్రదేశంబులన్
దలక్రిందై, తపమాచరించెడిని సంతానార్థమై, గబ్బిగ
బ్బిలపుంగుబ్బెత,లక్కటా! మొయిలుగప్పెంబూర్వమర్యాదకున్

పన్నీటన్ దలసూపి, కాపుగొను రంభామల్లికావాటికల్
జిన్నాదేవిగులాబితోఁటలు నశించె, న్గ్రిచ్చు, లుమ్మెత్తలున్,
గన్నేరుంబొద లావరించినవి, రంగత్తుంగభద్రానదిన్
బన్నుండె న్మనమోహనాంగికవితాప్రాగల్భ్యసౌరభ్యముల్.

నాయకురాలి మాయకదనంబున, మా పలనాటిపౌరుష
శ్రీ యడుగంటె, గడ్డిమొలిచెం బులిచాఁవలగద్దెమీఁదఁ, గెం

జాయ మొగానఁ గ్రమ్మి జలజప్రమదామణి నాగులేటిపై
వ్రాయుచునున్న దిప్పటికి, బాలునిశౌర్యకథాప్రబంధముల్.

వాసిని గన్న రెడ్డ పరపాలన, కొండలదండలన్ శిలా
శాసనసంగతి న్నిలిచి, చచ్చియుఁ జావదు, రెడ్డిరాణి మైఁ
బూసినకుంకుమంబుఁ బసుపుంబస లంటినకన్నె తొండ, నేఁ
డూసర వెల్గెను, నవయుచున్నది పండువెదుళ్ళసందులన్. ౮

## 9 శల్యసారథ్యము

అహిమ స్త్రములకు నొయ్యారంబు నేర్పించు
వలపుఁబిల్లనఁ గ్రోవిపాటగాఁడు
పసితనంబునయందుఁ బడగపాముల నెక్కి-
చిందులాడిన గొల్లచిన్నవాఁడు
పదియారు వేలగోపస్త్రీలతో నుండి
యపకీర్తి నందని యందగాఁడు
లోకాంతమున మఱ్ఱియాకుఁదెప్పం దేలి
తలదాఁచుకొన్న చిత్రస్వరూపి

భాసురము లైనతనచేతఁ జేసికనుల
మచ్చుఁ జల్లెడు వేలుపుమాంత్రికుండు
తోడరి విజయునియరదంబుఁ దోలుచుండె
కాంచి విల్లందుకొనుము భాస్కరకుమార! ౧

ములుకులు, నీధనుస్సున విముక్తములై చని, కృష్ణమూర్తికిన్
వలఁగొని, యావల న్నరునిపైఁ, గసిబూనుట దుస్తరంబుగాఁ
దలఁప, విదేటివెఱ్ఱి? భుజసర్పము వెన్నుని ముందు సాఁగునే?
మలపుదునా రథంబు? అనుమానముదోఁచె జయంబు కర్ణుఁడా?

వ్యయమైపోయినయమ్ములన్మరలఁగూర్పన్, దక్షమైయున్నయ
క్షయతూణీరము విచ్చి, పార్థుఁడు శరాసారంబు గుప్పించినన్
జయ మాదేవుఁ డెఱుంగు, గుఱ్ఱములపై, నాపై, భవత్సేనపైఁ
దయజూపించుటకూపిరాడఁగలదా? దౌర్భాగ్యధానుష్కుఁడా?

తూలినపందికై, హరుఁ డెదుర్కొని రేచిన గుద్దులాటకు
న్తీల, బలిష్ఠుఁడై కఱకు దేలినవాఁడు మహేంద్రసూతి, యా
శూలికె గుండె లేదతనిఁ జూడ నెగాదిగ, యుద్ధభూమిలో
రాలఁ దలంచితో?. పరశురామునిశిష్యుఁడ నన్న బిఱ్ఱునన్. ౪

బలవంతుండగుశౌరి రోషమురగుల్పం బార్థుఁడున్, గెలపుఁజూ
పులవేగంబునఁ దూపుల న్నడిపి, నీ మూర్ధంబు ఖండింపఁడా?
తలపై శాపము లాడునీకు నొకయుద్ధం బేల ? నీరక్తమున్
బొలయున్, గాకులు గ్రద్దలుం గుడుచునేమో! నేఁడు
[సూతాత్మజా!

ఖాండవము నర్జునుఁడు గాల్చుకాలమందుఁ
బరువులెత్తినముసలిసర్పమును వింటఁ
దొడిగినాఁడవు గాఁబోలు విడువవలవ
దబ్జనాభుఁడు, గరుడవాహనుఁడు సుమ్ము.

ఇలకుఁ గ్రుంగె రథంబుచక్ర, మిపు డేకీ నీకు గత్యంతరం ?
బలుక నీన్న ప్రతిపక్షి, గాండివధరుండై, చెండుచున్నాఁడు నీ
బలముఁ, గాలము లేదు స్యందనము లేవంచిపికొ, మ్మెట్టి కీ
తలపోఁత ? శ్శరణంబు వేఁడుకొనరాదా కర్ణ ! బీభత్సునిఁ?

---

## 10. భారతవీరుఁడు

ఘన కురుక్షేత్రసంగ్రామ గగనమునకు
భానుమంతుఁడవై, వైరివర్గములును
గలఁచి, గెలిచిన దండిమగండ వీవు
కర్ణ! కారణ మేమి దుఃఖపడ నింక ? ౧

సమరధర్మంబు విడి ధనంజయుఁడు సంపె
నతనిచేఁ జచ్చె రాధేయుఁ డనెడుపల్కు
పుట్టె ననుచింత కలదు కాఁబోలు నీకు
నట్లు కాదయ్య ! గెలుపు నీయదియె కర్ణ ? ౨

ధర్మముఁ దలంచి, నినుఁ గన్న తల్లి ననుఁగు
సోదరుల రేణువులభాతిఁ జూచినాఁడ
వౌర ! నీ స్వామిభక్తి, నీ యద్వితీయ
సుగుణసంపద వర్ణింప నగునె కర్ణ ! 3

వీరాగ్రేసర ! నీవు పాండవబలాబ్ధిఁ, మందరం బట్లు, దో
స్సారంబార మథించి, యంచితయశస్సారంబు, లోకంబునఁ

బారంజల్లిన సద్ధనుర్ధరుఁడ వెవ్వం డీడురా నీకుఁ? గ
ర్ణా! రాజన్యుల కెల్ల నీచరిత మన్నన్, గర్ణపేయం బగున్. ర
కింకన్ రుద్రునిఁబోలి, తేరి నడుచక్కిం జేరి, దృప్యద్ధను
ష్టంకారం బొనరించుచున్, విమతకంఠశ్రేణిఁ జెండాడు, నీ
వంకన్ జూడఁ గిరీటియంతటిప్రతాపస్ఫారమార్తాండుఁడే
జంకె, నీన్ కెదురెక్కువీరుఁ డొకఁడు న్జన్మించునే? భానుజా!

జననంబందినతత్క్షణంబ, కఠిన స్వాంతంబునన్, గంగ క
ప్పనగావించినక్రూరురా లనక, లోభస్వాంతయై, కుంతి, 'హా
యన! కర్ణా! సుతభిక్షరా! యనఁగ నాహా! మారుమాటాడ కి
చ్చినవిఖ్యాతవదాన్యమాన్యుఁడవు పొచ్చెం బేది నీకీర్తికిన్?

అరదము క్రుంగిపోయినపు డైనను, భార్గవరాముశాప వా
క్శరణి, శరంబు లూహ కెడ సన్నపు డేనియు, శల్యుఁ డెన్ని ని
ష్ఠురములు వల్కుచున్న, రణశూరత దక్కక, వైరివీరకం
ధరపటుకర్తనోద్యమమునం, జెలువారవె? సూర్యనందనా!

ఒక పాంచాలికి భర్తలేవురని, మర్త్యుల్ గూడి మాటాడువా
డుకయే, కర్ణకఠోరమై మసలుచుండన్ డెందమం, దట్టివా
నికి, నా కౌరవభర్తనామము ధరన్నిర్మింప కంచు న్మరా
రికి వాక్రుచ్చి, యశంబుఁ జాటవె? ధరిత్రీమండలిన్ భానుజా!

పార్థనామంబు చెవిలోనఁ బడినయంతి
భగ్గుమని మండిపోవు నాపాదమస్త
కంబు నీ, కట్టి మీవైర కారణంబు
చాటుచున్నది కర్ణ! నీ స్వామిభక్తి

'చండగభస్తిమండల మొసంగిన నాతొలిచూలి కాన్పు క
ర్ణుం'డనుకుంతిమాటకుఁ దనూలత కంపము నంద ధర్మసూ
నుండెలుఁగెత్తియేడిచి, నినుంగొనియాసుచుఁబల్కె, "నట్టి శూ
రుం డిఁక పుట్టబోఁ"డన నిరూపణచేయుచు, సూర్యనందనా!

చెవుల న్గుండలముల్ ప్రభావిభవరాజిన్ జిమ్మ వర్మంబుఁ
బుట్టువుతోఁ గల్గిన ముద్దుబిడ్డడవు, నీటుం గోటు దీపింప, రెం
డవమీనాంకుఁడువోలి విల్లుఁగొని, జన్యక్షోణులం జొచ్చి, శా
త్రవనాశం బొనరించునిన్నుఁ గని కర్ణా! కుంతియెట్లోర్చెనో!

మిపులఁ బవిత్రవంతమయి, మేదినిఁ గాలువ గట్టి, మర్మరా
రవము సెలంగ, నీదు రుధిరంబు స్రవించుచు "అర్జునా! యధ
ర్ముడవు, భవ" మంచు నెంత వలపోసెనో, శత్రుకళేబరంబు లం
టవలసె నంచు, నెంత వనటం బడినాఁడవొ కర్ణ! కూలుచోన్.

నరుఁడు,బృహన్నలాఖ్య, నటనాఁడు విరాటుని గొల్చుచుండి,యు
త్తరునకు నాయకుండై, కురుశతంబును మూర్ఛలఁ గొట్టినాఁడు, భా
స్కరసుతుఁ డోడె నందు రని, కన్నులనీరిడకయ్య! శక్తులై,
గురుఁడు, నదీసుతుం డెదురుకొన్నది లేదుగదయ్య, భానుజా!

## 11. బుద్ధమహిమ

సరవి నీవు కడకంట వెల్గిన యహింసాజ్యోతికిన్, గొండలున్
గఱఁగింపంబడె వెన్నపూసలవలెన్, తమోమండలం బెల్ల, నీ
చరణాబ్జంబుల ముద్దుఁగొన్నది, మహీశగ్రామణీ జ్ఞానభా
స్కర! 'బుద్ధప్రభు' నీసుధోక్తులను సంస్తంభించె,ముల్లోకముల్.

నీ వల రావిచెట్టునకు నేర్పిన భూతదయారసోక్తిలో,
భూవలయంబు బాష్పజలపూరితలోచన మయ్యె, బింబిసా
రావనిభృత్సభాభవన మార్ద్రిమనస్కతఁ గ్రుంగిపోయె, నీ
పావనబాహుపీఠమునఁ, బ్రాణము దక్కెనగొఱ్ఱెపిల్లతో. ౨

పాములు గాలిమేఁత లలవాటొనరించుట కీవు కారణం
బేమొ ! త్రిదండిరాజపరమేశ్వర ! నీదుపదాంకముద్రలోఁ
జీమయు, హాయిగా నిదురఁజెందిన, దెక్కడి దీ యకారణ
ప్రేమ ? జోహారు! నీనయన వీథులఁ దాండవమాడుశాంతికిన్. 3

కరకుకసాయివాని చిరకత్తియు, నెత్తురు సూడలేక,.నీ
చరణరజంబు సోకిన రసాతలసీమలలోన, నిప్పుడు
ర్వరఁ బెకళించి చూచు ప్రతివానికి, నీనుహనీయవిగ్రహో
త్కరములు దర్శనంబిడు, నఖండదయారసదుగ్ధవాహ్నలన్. ౪

దీనములైన చూపుల వధించెడువానికి మ్రొక్కి, "అన్న ! నా
కూనల కండ లేదు కనుగొమ్మ" ని గద్గదనిస్వనంబుతో
లోనఁ దపించి, నాల్గుదెసలుం బరికింపుచు, బుద్ధదేవ ! రా
వే ! నను బ్రోవవే !' యని జపింపనిజంతువు లేదు మేదినిన్.

పైకొని రెండువేలయిరువందల యేండ్లు వయస్సు వచ్చియున్
నీ కమనీయబోధలకు నిగ్గు రవంతయుఁ దగ్గ లేదు, హిం
సాకరణంబు పాప మనుశబ్ద మశోకుని ఱాతిగుండెకున్
దాఁకి, యగల్చి, యీదినమునన్ గదలించెడి నష్టదిక్కులన్. ౬

## 12. భీష్ముఁడు

వృద్ధవీరుఁడ! నీ వయ స్సెంత చెపుము?
తండ్రి మరణించియే మూఁడు తరము లయ్యె
నౌర! భారతయుద్ధమధ్యంబునందు
పడుచు పార్థునిఁ దల్లడపరచినావు. ౧

కోడెవయస్సు నిన్నలమి గోటికి మీసము చిక్కనాఁడు, ము
య్యేడిరునాళ్లు పోరు వెలయించిన భార్గవరాముఁ డెంత య
ల్లాడెనొ! మూఁడుగాళ్ళముసలయ్యవు నేఁటికెదిర్చికృష్ణుఁడున్
గ్రీడియుఁ, దల్లడిల్లి రవని న్నిను గెల్చుమగండు పుట్టెనే? ౨

*“వెలిమావుల్ రుధిరంబు గ్రక్క, గతిదప్పెం దేరు, సంధించున
మ్ములతో గాండివమూడె, సాఁగవుకరంబుల్, బావ! ఆలంబునా
వలగా” దంచుధనంజయుండు కనులన్ బాష్పంబులన్నించఁడే?
బలమో! లేక మహాత్త్వమో! యిదితలంపన్ రాదు, గంగాసుతా?

ఆరయ నీవు ధర్మజున కాయువుపట్టెఱిఁగింపకుండినన్
శౌరియు, సవ్యసాచి, మరునాఁడు రణంబున నిల్తురే? కృపా
పారగ! నిక్కపుంగినుక పైకొని నీవు ధనుస్సుఁ బట్టినన్
నీరయి పోవె లోకములు? నింగి గుభిల్లునఁ గూలిపోవదే?

అంబ, శిఖండియయ్యె నతఁ డాఁడుది, వానిమొగంబుఁజూడవం
చుం, బరిపూర్ణపౌరుషవిశుద్ధికి భంగము గల్గకుండ, వి
ల్లంబులు పాఱవైచితివి యర్జునవీరుని కీర్తి నిల్ప, గం
గాంబిక ధన్య యయ్యెనుగదా? నినుఁ గాంచి, ధనుష్మదగ్రణీ?

గురువు గొడ్డలిఁ ద్రిప్పుకొని తప్పుకొనుదాఁక
మరలి వెన్కకు రాని మార్గణంబు
ముత్తరంబులనుండి ముదిరి ముద్దలు గట్టి
చేవ డిందని పచ్చియౌవనంబు
వసుసప్తకము సొనఁబట్టి జీవము వోసి
యొసఁగు కక్కసపు టాయుధబలంబు,
స్వర్గతరంగిణీస్తన్యంబు బలిమిని
సంప్రాప్తమైన తేజశ్చయంబు,

గవ్వకుం గాని పాడుశిఖండిముందు,
వ్యర్థపుచ్చితె పార్థునిపరువుకొఱకు?
జగము నగలించు నీ దివ్యశంఖరవళి,
పవ్వళించెనె యమ్ములపడకమీఁద ? ౬

కౌరవునియాస గంగలోఁ గలసిపోయె,
పరశురామునివేఁడి నిశ్వాసములకు,
నిందగిరి క్రాఁగి బూదియయ్యెను గదోయి,
శంతనకుమార ! నీ విలు జారిపోవ. ౭

## 13. రాజరాజు

నిన్నుఁ బోలుమహీనేత నిక్కువముగఁ
బుట్టెనో ! పరాశరదివ్యమునిసుతుండు
మున్ను మాతాత, పరిహాసమునకుఁగాను,
కల్పనముచేసి వ్రాసెనో ! కౌరవేశ. ౧

మా తాత సత్యవంతుఁడు,
పూతములగు నాల్గువేదములు వ్రాసిన వి
ఖ్యాతకవీంద్రుం డాతని
చేతికల మబద్ధములు వచింపదు సుమ్మీ! ౨

వ్యాసకల్పితమహాభారతామ్నాయంబు,
గుట్టుగా నినుఁ దిట్టుకొనుచునుండ,
ముగురుసత్కవులపెంపుడు కావ్యరాజంబు,
పదిమందిలో బట్టబయలుసేయ,
నింతలంతలు సేయు, దృశ్యప్రబంధాళి,
మొత్తమై నిన్నాడిపోసికొనఁగ,
చెప్పడుమాటకుఁ జెవి యొగ్గి భువనంబు
క్రూరాత్ముఁ డని పండ్లు నూరుకొనఁగ

తొడలు తెగినబాధతో, నింతదుష్కీర్తి
తోఁ, బరాజయంబు తోడు రాఁగ
నరకమునకుఁ బోయి నావా! స్వర్గమునకుఁ
జేరినావా! నీవు కౌరవేంద్ర! ౩

నీ సావాసముచేసి, ముజ్జగముఁ బిండింజేయఁగాజాలు, రా
ధాసూనుం డొకవ్యర్థజీవి యయి, నిందాబద్ధుఁడై పోయె నీ
యాసల్ భీమగదాభిఘాతమున నుగ్గై, యూరుయుగ్మంబుతో
నీ సింహాసనసీమ దుఃఖపడుచుండె న్నేఁడు, కన్నీళ్ళతో! ౪

సవ్యసాచికరాన సాము నేరిచికొన్న
బలమైన క్రొవ్వాఁడి బాణములకు,
వాయుసూనుని బాహుబలముతోఁ బోరాడు
మొక్కవోవని పుష్టిమకుక్కగదకు,
పాంచాలినులివెచ్చ బాష్పాంబువులఁ దేలు
వజ్రనిష్ఠుర శాపవాక్యములకు,
యమ తనూభవుని దీనాలోకములఁ దోఁగి
దీపించుశీతలాలాపములకు,

సకలభువనంబు లాలించి సమ్మతించు
వనజనాభునిశుభ రాయబారమునకు,
సమ్మతింపక, రక్తనిర్ఝరములందుఁ
దానమాడితి వేల ? గాంధారితనయ !

అంటఁగరానియగ్ని కెనయైనది ద్రౌపది, యట్టిసాధ్వి, ప
య్యంటమొగానఁబూని,యకటా! యనియశ్రులురాల నేడ్చిన
దుంటరివై, సహోదరులతో సభలోనఁ బరాభవించినా
వంట, మఱందివై వదినకా ? మొనగానితనంబు సూపుటల్

కురుభూపాలుఁడు, బుద్ధిమంతుఁ డని వాకోబూనితింగాని, యా
దరణీయంబులు హేతువు ల్గలుగవద్దా? నీచరిత్రంబునన్
గరళాన్నంబును,మాయజూదమును, లాక్షాగేహమున్, ద్రౌపదీ
పరిభావంబు, భయంకరంబులయి చూపట్టుం,గురుక్ష్మాపతీ! ౭

నీ యతనంబు లన్నియును నేత్తురుకూడు భుజించి మాయమై
పోమెఁగదా ? వృథాపయశమ్ముం దలదాల్చినసీకు నేఁడు నిం

డాయువుఁ బోసినారు కవు, లక్కటా! పెందొడ లూడి,కుంటివై,
యీయవమానజీవితము నెట్లుసహింతువయా! సుయోధనా!

## 14. శ్మశానవాటి

ఎన్నో యేండ్లు గతించిపోయినవి గాని, యీశ్మశానస్థలిన్
గన్నుల్ మోడ్చినమందభాగ్యుఁడొకఁడైనన్ లేచిరాఁడక్కటా!
యెన్నాళ్ళీచలనంబు లేనిశయనం బేతల్లు లల్లాడిరో!
కన్నీటంబడి క్రాఁగిపోయినవి, నిక్కంబిందు పాషాణముల్. ౧

ఆకాశంబును కాఱుమబ్బుగము లావరించె, దయ్యాలతో
ఘూకంబుల్ చెరలాడసాఁగినవి, వ్యాఘోషించె నల్దిక్కులన్,
గాకోలంబులు, గుండె ఝల్లుమనుచున్నంగాని, యిక్కాటియం
దాకల్గాడినజాడ లే, దిచట సౌఖ్యం బెంత క్రీడించునో! ౨

ఇచ్చోటనే సత్కవీంద్రునికమ్మని
కలము, నిప్పులలోనఁ గఱఁగిపోయె ?
యిచ్చోటనే భూము లేలురాజన్యుని,
యధికారముద్రిక లంతరించె ?
యిచ్చోటనే లేఁత యిల్లాలినల్లపూ
సలసౌరు గంగలోఁ గలసిపోయె?
యిచ్చోటనే నెట్టిపే రెన్నికం గనుఁగొన్న
చిత్రలేఖకుని కుంచియ నశించె ?

ఇది పిశాచులతో నిటాలేక యుండు
గజ్జె గదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణమాత తీక్షణదృష్టు లొలయ,
నవసఁ బాలించు భస్మసింహాసనంబు. 3

ముదురుతమస్సులో, మునిఁగిపోయినక్రొత్త సమాధిమీఁదఁ, బై
బొదలుమిణుంగురుంబురువు పోలిక, వెల్గుచునున్న దివ్వె, ఆ
ముద ముడివోయినన్, సమసిపోవుట లే నది దీపమందుమా ?
హృదయముసుమ్మి, నిల్పచనియె న్గతపుత్రిక, యేయభాగ్యమో'

కవులకలాలు, గాయకుల కమ్మనికంఠము, లీ శ్మశానపుం
గవనులఁ ద్రొక్కి చూచెడి నొకానొకనాఁ డలకాళిదాస భా
రవుల శరీరముల్, ప్రకృతిరంగమునం దిపు డెంత లేసి రే
ణువు లయి, మృత్తికం గలిసెనో కద! కుమ్మరివానిసారెపై. ౪

ఆలోకించిన గుండియ ల్గరఁగు, నాయీ పిల్లగోరీలలో
నే లేబుగ్గలసౌరు రూపఱియెనో! యేముద్దు నిద్రించెనో!
యే లీలావతిగర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో!
యీలోకంబున వృద్ధిగాఁదగిన యేయేవిద్య లల్లాడునో? ౫

ఇట నస్పృశ్యత సంచరించుటకుఁ దావే లేదు, విశ్వంభరా
నటనంబున్ గబళించి, గర్భమున విన్యస్తంబు గావించి, యు
త్కటపుం బెబ్బులితోడ మేఁక నొకప్రక్కన్ జేర్చి జోకొట్టి, యా
ఱటఁ గల్పించున భేదభావమును, ధర్మం బిందుఁ గారాడెడిన్.

వాకొన రానిగొప్పధనవంతుని నిద్దపుఁబాలఱాతిగో
రీకడఁ బారవేయఁబడి, ప్రేలికలం బొరలాడు ప్రేత, మే

యాఁకటిచిచ్చునఁ గుమిలి, యార్చి, గతించినపేదవాని బో
నోశద! వానికై వగవఁ డొక్కఁడు, దాఁచదు కాటినేలయున్.

## 15. శిశువు

బోటనవ్రేల ముల్లోకములు చూచి లోలోన
నానందపడు నోరులేనియోగి
తల్లిదండ్రులతనూవల్లరీద్వయికి వ
న్నియఁ బెట్టు తొమ్మిదినెలలపంట
అమృతంబు విష మనువ్యత్యాస మెఱుఁగ కా
స్వాదింపఁ జనువెఱ్ఱిబాగులాఁడు
అనుభవించుకొలంది, నినుమడించుచు మరం
దము జాలువాఱుచైతన్యఫలము

భాష రాదు, వట్టి పాలుమాత్రమె త్రాగు,
నిద్ర వోవు, లేచినిలువ లేఁడు,
ఎవరెరుఁగ రితని దేదేశమో కాని.
మొన్న మొన్న నిలకు మొలిచినాఁడు. ౧

గాన మాలింపక కన్ను మూయనిరాజు
అంబకౌఁగిటి పంజరంబుచిలుక
కొదమకండలు దేరుకొను పిల్లవస్తాదు
యుయ్యేల దిగని భాగ్యోన్నతుండు
ఊఊలు నేర్చిన యొక వింతచదువరి
సతిని ముట్టనినాటి సాంబమూర్తి

ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి
తనయింటి క్రొత్త పెత్తనపుదారి
ఏమిపనిమీఁద భూమికి నేగినాఁడొ!
నుడువ నేర్చినపిమ్మట నడుగవలయు
నేండ్లు గడచిన ముందు ముం దేమొ కాని
యిప్పటికిమాత్ర మేపాప మెఱుఁగఁ డితఁడు. ౨

నవమాసములు భోజనము నీర మెఱుఁగక
పయనించుపురిటింటిబాటసారి
చిక్క చీఁకటిఁ జిమ్ము జేనెఁడుపొట్టలో
నిద్రించి లేచిన నిర్గుణుండు
నునుఁజెక్కిళుల బోసినోటినవ్వులలోన
ముద్దులుచిత్రించు మోహనుండు
అక్షయం బైనమాతృక్షీరమధుధార
లన్నంబుగాఁ దెచ్చుకొన్న యతిథి

బట్టఁ గట్టఁడు, బిడియానఁ బట్టువడఁడు,
ధారుణీపాఠశాలలోఁ జేరినాఁడు
వారమాయెనొ! లేదొ! మాప్రకృతికాంత
కఱపియున్నది వీని కాఁకలియు నిద్ర.

ఊయెలతొట్టి యే యుపదేశ మిచ్చెనో!
కొసరియొంటరిగ నూకొట్టుకొనును
అంబతో తన కెంత సంబంధ మున్నదో
యేడ్చి యూఁడిగముఁ జేయించుకొనును

పరమేశ్వరుం డేమి సరసంబు లాడునో!
బిట్టుగాఁ గేకిస ల్పొట్టుకొనును
మూనాళ్ళలోన నెప్పుడు నేర్చుకొనియెనో'
పొమ్మన్నచోఁ జిన్న బుచ్చుకొనును

ముక్కుపచ్చ లారిపోయి, ప్రాయము వచ్చి
చదువు, సంధ్య, నేర్చి బ్రదుకునపుడు
"నాదుపసిడికొండ, నారత్న" మని తల్లి
పలుకు పలుకు లితఁడు నిలుపుకొనునె? ౮

తనచేతిగిలకపంజునకు ముచ్చట సెప్పఁ
బలుక లే డనుచుఁ గోపంబుసేయు
పొరుగింటిఇల్లాలి సరసఁ జీఁదరఁ జెంది
పరు లన్న భేదభావమును జూపు
మకరందమునకు సమ్మతిఁ జూపి నోరూరి,
దరిఁజేరి, రుచులభేదములు తెలియు
ప్రతిశబ్ద మీను నుగ్రధ్వాన మాలించి,
కంపించి తల్లినిఁ గౌఁగిలించు

దాయ లార్గురు నొకరు నిద్దరును దప్ప,
చేరుకొన్నారె లీతని చిత్తవీధి
జగతి నీతని జాతకచక్రమందుఁ
బొంచియుండున దపయశంబో, యశంబొ! ౯

## 16. బాష్పసందేశము

ఆలోకింపు మొకింత భారతకుమారా! నిండుపెద్దమ్మచే
గాలింపంబడి, దుమ్ముచే మలయునంగశ్రేణి దూల న్నిరా
శాలంబంబున, నీమహోన్నత సుధాసౌధంబుక్రీనీడలం
దాలుంబిడ్డలు బిచ్చమెత్త, నిరతం బల్లాడుమానుష్యముల్. ౧

నీసోదర్యులు వారు, కా రనుచుసందేహింతువో ? వీరిస్వే
చ్ఛాసామగ్రి గతించి వత్సరసహస్రంబుల్ సనెన్, దీని కీ
వే, సాక్ష్యంబును, గారణంబు, నిపు డేమీ మించిపోలేదు, ఆ
శ్వాసింపంగదవయ్య, భారతతనూజా! ప్రాంతచుట్టంబులన్. ౨

కుడుము నోసంగఁ బండు వనుకొంచు, రమాయకు లిప్పుడైననీ
మడులును,మాన్యము ల్పసిఁడిమాడువు లిమ్మన,రింటనుండు పెం
పుడుపసరంబు లట్టులు మముం గణియించినఁ జాలునంచు, నీ
యడుగుల నంటి దీనముగ నంజలిఁ బట్టిరి ధర్మభిక్షకై ౩

అనుఁగుందమ్ములు దిక్కుమాలి, పురబాహ్యక్షోణిఁగారాడ, హె
చ్చినసౌభాగ్య సువర్ణమందిర సమాసీనుండవై, హాయిగా
గను మాయం దగవా? పరాకుపడి, యింక న్మేలుకొమ్మిమ్మధరా
జనయిత్రీమణి తమ్ముఁగుఱ్ఱలకు స్వేచ్ఛాభిక్ష లర్థించెడిన్. ౪

ఆనందంబున నీసహోదరులు విద్యాస్వీకృతిం జెందినా
రీనాఁ డల్లదె, శుభ్రవస్త్రములతో నేతెంచుచున్నారు, నీ
తో నిత్యోచితదైవపూజకని, సంతోషంబునన్ జేర నీ
వేని, న్నెవాక రాక్షసాకృతివి సుమ్మీ! భారతీనందనా! ౫

కరుణావీరుఁడు, భారతీయుఁ డని దీర్ఘవ్యాసముల్ వ్రాసి నీ
కొఱకై, వైరికి వెన్నుఁజూపని యనుంగుంజట్టముల్ వీరు, దు
ర్భరదాస్యంబు సహింప నోప, రనుకంపం బూననో యింక, నీ
తరళాపాంగము పేరుగన్నది యభూతన్యాయతాదృష్టికిన్. ౬

కారుణ్యంబున నంటరానితనమున్ ఖండింపవా? యీ నిరా
ధారవ్యక్తుల ఘోషణంబు వినరాదా నీకు? నాంగ్లేయులన్
మారాజ్యం బిడుఁడంచు వేఁడుకొనుచున్నా విట్టి నీ కిత్తురా?
ప్రారంభంబున నిట్లు దిద్దుకొనుచుయ్యా! కోర్కెసిద్ధించెడిన్.

కర మింపారెడు నీ విభూతిక శిరఃకంపంబుఁ గావింపవా
పరదేశంబులు పూర్వ? మీదినము నీస్వార్థక్రియాపేక్ష, సో
దరవిద్వేష మెఱింగి, మూతివిఱచున్ దద్దేశముల్, నీయశోం
బరమున్ జిమ్మటగొట్టుచున్న, దిఁక విప్పంబోలు నేత్రాబ్జముల్.

"మాముత్తాతలనాటినుండి నిను సన్మానించి, నీ కోసమై
మామేనంగల రక్తబిందువుల సంపత్తి న్సమర్పించినా,
మేమో, నీహృదయంబులో నెనరు లేదీషత్తు, నింకెన్నఁడ
న్నా! మాకష్టముగట్టు కెక్కు"నను చున్నారేమి వాక్రుత్తువో!

## 17. తెలుఁగు తల్లి

కృతు లందుటకు పల్లకీ మోయ దొరఁకొన్న
కృష్ణరాయఁడు రాజ్య మేలునాఁడు
మనుమసిద్ధియును దిక్కన గన్నకావ్యంబు
కోరచూపులు జూచుకొన్ననాఁడు

తెలుఁగురాయని యొప్పు లొలుకు గుప్పిటిలోన
లేఁతకస్తురి గుబాళించునాఁడు
ముత్యాలమందిరంబుల సత్కవులమీఁద
బంగార మేరులై పారునాఁడు
కవులపల్కులు వేదవాక్యంబు లగుచు
క్షితితలంబును గంపింపఁ జేయునాఁడు
గారవంబున నన్నేలఁ గాంచవైతి?
తెలుపఁగదవమ్మ! నను గన్న తెలుఁగుతల్లి! ౧

అలసానికులజుఁ డూయలమంచములనుండి
పసిఁడిలేఖినిఁ బూని వ్రాయునాఁడు
పోతనార్యుని గేహమున భారతీదేవి
చిగురుఁజేతుల వంటఁజేయునాఁడు
భువనభీకరుఁడు వేములవాడ భీమన్న
గంగ్రాజునకు జోలెఁ గట్టునాఁడు
శ్రీనాథకవి పాండితీనైపుణ్యము మీఱ
డిండిమభట్టు నోడించునాఁడు
కనులఁ జూచెడుభాగ్యంబు గలిగియున్న
నేఁడు నా కవిత్వంబు రాణించియుండు
గారవంబున నన్నేలఁ గాంచవైతి ?
తెలుపగదవమ్మ! నను గన్న తెలుఁగుతల్లి!

పసుపుముద్దల నుంచి సతికి రోసముఁ బోయు
వీరపత్నులు పుట్టి పెరుగునాఁడు

ప్రతిన దప్పక వైరివక్షముల్ పెకలించు
వెలమబెబ్బులులు జీవించునాఁడు
కాళిందిలోఁ గత్తిఁ గడగి, తల్లికిఁజూపు
శివరాజు పగతుఱఁ జెండునాఁడు
తమ్మిమొగ్గరము లుద్ధతిఁ జీల్చికొనిపోవు
పిల్లవిల్కాం డ్రుద్భవిల్లునాఁడు
పిఱికి నెత్తురు నాలోన వెలయ దేమొ ;
రంభ, నా పేర నుత్తరాల్ వ్రాయు నేమొ;
గారవంబున నన్నేలఁ గాంచవైతి ?
తెలుపఁగదవమ్మ ! ననుఁ గన్న తెలుఁగుతల్లి ! ౩

అలఘుదాతలదానజలధిలోపల మున్గి
పెద్దమ్మ కన్నీరు విడుచునాఁడు
శరణాగతత్రాణ బిరుదంబు రాజుల
వెడదఱొమ్ములమీఁద వెలుగునాఁడు
అన్యకాంతలమోములందుఁ బూరుషజాతి
కన్నతల్లులమూర్తిఁ గాంచునాఁడు
సహజపావనమైన సర్వసమత్వంబు
ప్రతినేత్రమునఁ జాలువాఱునాఁడు
వారి కబ్బిన కీర్తి సంపత్తిలోనఁ
గొంతలోఁ గొంత నేఁ బంచికొందు నేమొ;
గారవంబున నన్నేలఁ గాంచవైతి ?
తెలుపఁగదవమ్మ ! ననుఁ గన్న తెలుఁగుతల్లి! ౪

## 18. శిల్పి

చేత మిగురొత్తనొక నల్లతాతియందు
మలచినాఁడవు, భయద సింహములతలలు
వసుధఁ గన్పట్టు సర్వపర్వతములందుఁ
జిత్రముల నెన్నిగతులఁ జూచెదవొ! నీవు. ౧

సునిశితంబైన నీచేతి సుత్తెనుండి
బయలువడె నెన్ని యెన్ని దేవస్థలములు
సార్థకము గాని యెన్ని పాషాణములకుఁ
గలిఁగె నీనాఁడు పసుపుఁగుంకుమలపూజ. ౨

కవికలంబునఁ గల యలంకారరచన
కలదు కలదోయి శిల్పి! నీ యులిముఖమునఁ
గాకపోయినఁ బెనుతాతికంబములకుఁ
గుసుమవల్లరు లేరీతి గ్రుచ్చినావు? ౩

ప్రతిమలు రచించి యొకమహారాజుచరిత
వల్లెవేయింపఁగలవు చూపఱులచేతఁ
గవనమునఁ జిత్రములు గూర్చు కవికి నీకుఁ,
దారతమ్యంబు లే, దబద్ధంబు గాదు. ౪

తాల నిద్రించు ప్రతిమల మేలుకొలిపి
యులిని సోఁకించి బయటికిఁ బిలిచినావు
వెలికి రానేర్చి, నీపేరు నిలుపకున్నె
శాశ్వతుఁడ వోయి, నీవు నిశ్చయముగాను. ౫

తలయెత్తన్ గద, నీకుచాతురి యజంతాగహ్వరశ్రేణిఁ, గే
వల పాషాణములందు, జీవకళ నిల్పంజాలునీను త్తైలో
మొలుచు న్మానవవిగ్రహంబులు, మహాపుణ్యాంశవయ్యా! హరి
త్తులు, నీ బొమ్మలచెంత, ముగ్ధగతి నందున్, శిల్పికంఠీరవా!

నునుపుల్ దీర్చి, మదంబు చిందిపడ నేస్తున్ గున్నలన్ జెక్కి-వై
చిన చాతుర్యము, నీ శిరోగ్రమున నిల్చెన్, సత్కిరీటాకృతిన్
తెనుగుం దేశము నిన్నువంటిపనివానింజూచి, యుప్పొంగుచుం
డును, నీ లేమిఁ దలంచి కంటఁ దడిఁ బెట్టున్, శిల్పవిద్యానిధీ!

తెలితాతన్ జెలువార నచ్చరపడంతిం దిద్ది, యా సోగ క
న్నులపజ్జన్ నిను నీవు దిద్దుకొని, సంతోషించుచున్నాఁడవా!
భళిరే! శిల్పి! జగంబులోనఁ జిరజీవత్వంబు సృష్టించుకోఁ
గల నీ కెవ్వఁడు సాటివచ్చును? నమస్కారంబు నీ ప్రజ్ఞకున్.

## 19. ఇంటిగెలుపు

శ్రీరాముఁ డేకొండశిఖరానఁ గన్నిట
నాలించె సీతాపహరణగాథ
దాటించె నే పీటిదాపున నైతమ్మ
పట్టి, మేల్పొట్టెలివాహనంబు
కోటకొమ్మలమీఁదఁ గ్రుచ్చినా లేపీటి
తెలుఁగురాజులు విరోధులశిరాలు

ముత్యాలతో నారఁబోసినా రేవీటి
నృపతు లేటేటఁ బండినయశస్సు
భాస్కరుని దానధార లేపట్టణంబు
చారుచరితకు బంగారునీరు వోసె
అట్టి వినుకొండ కడుపునఁ బుట్టుకతన
ధన్యుఁడను నేన! యుత్తమోత్తముఁడ నేన! ౧

ఇంగువ గట్టిన గుడ్డవ
లెం, గీరితికప్పూరంబు లేశములు, చరి
త్రం గోచరింప, నిప్పుర
మంగు దొలఁగి కాలదండహతి నిట్లయ్యెన్. ౨

ఏ నిపు డన్య దేశమున నెట్టి మహానగరాన నున్న, స్వ
స్థానముఁ జేరుచో, నగుచు స్వాగతమిచ్చు నగంబుమీఁదియీ
శానుని దివ్యమంటపముచాయలు, ప్రోన్నతమైన టిప్పు సు
ల్తాను మసీదు గుబ్బల విలాసము, లేశము విస్మరింతునే! ౩

ఏ కాలంబుననో నశించినవి, మున్నీలాటి సత్కారపుం
బోకి ళ్ళీపురి, నస్తమించె జరమాంభోరాశి మార్తాండుఁడున్
శ్రీకాంతుండు పునఃప్రతిష్ఠఁబొనరించెన్ గ్రమ్మఱన్, దెల్గుభా
షాకల్యాణి! పచారిసేయుము జయేచ్ఛం బంచకల్యాణిపై.

సకు లింటన్ గెలిపించినార, లిఁక రచ్చం గెల్తు నెందేని, సా
ర్థక మయ్యెం గవితాపరిశ్రమ, విధూతం బయ్యెఁ జింతాతమ
శ్శకలంబుల్, దొలికోడి గూసిన దుషస్సంధ్యారుచిం దేలుమా
మకపూర్వాశ జనింపఁడో చిఱుతసంపత్సూర్యుఁడింపారఁగన్.

జననంబందితి మీసమక్షమున, మీ సాన్నిధ్యమం దాడి నాఁ
డని గోలీలు బజారుడుమ్ము మొలనంటఁగ బాలురంగూడి, యీ
వినుకొండన్ గనుగొన్న, నాహృదయ మావేశంబునంబొంగిపో
వును, మీరిచ్చిన నీయకున్న సహజంబుల్ భక్తితాత్పర్యముల్.

నా నిశ్చయము విన్నవింతు వినుఁడాంధ్రక్షోణిపాంగార, మీ
వాని న్నన్ను బహూకరించితిరి, లోపం బింత రాకుండఁగా
నీ నూరారులు వెండినాణెములు, వేయిన్నూరుబంగారు సో
పానాలైనవి, మీ యశస్సతి వసింపంబోవుసౌధానకుఁ. ౭

పోయె నమాస రే, లిప్రుడు పున్నపువెన్నెల వచ్చె, యుల్లముఁ
గోయిలపిట్టయె, తెలుఁగుకొమ్మ తలన్నివసించె, హాయిగాఁ
గూయక పోవునే, చిగురుకోకలతోడ వసంతలక్ష్మియున్
డాయఁగ వచ్చెఁ, బుష్పవదనంబునఁ బ్రేమమరంద మూరఁగఁ.

## 20. రాజదర్శనము

మానిత రావు వేంకట కుమార మహీపతి సూర్యరాయభూ
జాని! హాసాదు, మీస్థిరవిశాలవితీర్ణికి, నేను నేఁడు పెం
పూను కవిప్రపంచమున నొక్క మిణుంగురుఁబుర్వు నున్నతిఁ
గానక సంచరించెడు నొకానొక పేదను వృద్ధికాముఁడన్. ౧

అల దిగ్దంతులవంటి పండితుల కావ్యాంభోధులం దూర్మిశ
య్యల నుయ్యాలలల నూఁగు మీచరణ దివ్యద్దర్శనార్థంబు రాఁ,

దలఁకె న్నాకవితాకుమారి, నరనాథా! ముద్దరా లేమి సొ
మ్ములతో రావలెనో? యెఱుంగదు, భయంబున్ దీర్చి
[మన్నింపవే.
శరణం బిచ్చిరి నా యనాథకవితాచంద్రాస్య నీక్షించి, ము
గ్గురు శ్రీమంతులు వర్ణఖండనవిదగ్ధుల్, వారియాలంబన
స్థిరత న్నేఁ డొకయింటిదై నిలిచి, పొల్పేఁగాని, లేకున్న బం
ధురసన్న్యాసముఁ బుచ్చుకొన్నదయి యుండున్ సూర్యరాయా
[ధిపా!
స్మరణీయుండగుసిద్ధిరా'జనుగుమామా!'యంచుఁదిక్కన్నతో
నెఱపెన్ జుట్టరికంబుఁ, గ్రొత్తదనుసందేహంబు లేదో మహీ
వర! మన్నింపుము సాహసోక్తులు, కవిత్వప్రాప్తిపై, నేను ద
గ్గఱచుట్టంబను రాచవారి కనుదీఱాలేశ ముండున్నదా?
అతిమనోహర భావనాకాశపథమునఁ
బ్రాలుమాలక పల్లటీలుగొట్టి
శైరీషకుసుమకేసరపుగుత్తిని మొత్తు
మెఱుఁగు శయ్యలమీఁద మేను వాల్చి
యుపలంబులోఁ జెమ్మ లూరించు కమ్మని
వ్యంగ్యవీచిక లెక్కి పరువు లెత్తి
చిరకాలమునఁ బుట్టి చివికిపోయినప్రాత
భూషణంబులు చూచి మూతి విఱచి
గ్రంథరూపంబుఁ దాల్చుభాగ్యంబు లేక
కంటఁ దడివెట్టుచుండు నాకవనపటిమ
ఏమిసేయుదుఁ బ్రోచురాజేంద్రుఁ డేఁడి?
కర్ణుఁ డేమాయెఁ గులపరీక్షకు-'నడుము? ౫౬

సాంగోపాంగముగా రచించితిని భాషాశుద్ధి, మారాటరా
సింగంబైన శివాజిరాజుకథ, శ్రీ శ్రీశైలపత్యాహ్వాయుం
డగీంకారమునన్ వరించె, నవనీశా! కోరినన్, దానిపై
సింగారంబు నొకింత సూపెదను దాక్షిణ్యాక్షి నర్పింపవే! ౬

మనుచారిత్రము, కృష్ణభూవిభుఁడు సన్మానించు నుయ్యేలపా
న్పున, మృష్టాన్నములందుఁ గప్పురపుఁ దాంబూలంబులం
[దంకురిం
చినయానందరసంబులోఁ బొటమరించెన్ భూపతీ! పొట్టనిం
డనిమాబోంట్లకలంబు లెక్కరణి విన్నాణంబుఁ జూపించెడిన్?

నా కవితావధూటి వదనంబు నెగాదిగఁ జూచి, రూపరే
ఖాకమనీయవైఖరులు గాంచి, "భళీ! భళి!" యన్నవాఁడె, "మీ
దేకుల" మన్నప్రశ్న వెలయించి, చివుక్కున లేచిపోవుచో
బాకునఁ గ్రుమ్మినట్లగును పార్థివచంద్ర! వచింప సిగ్గగున్. ౭

## 21. గుంటూరు సీమ

శ్రీనాథకవిశిరస్సీమ నట్టువ ద్రొక్కు
దీనారములకు మదింపుగట్టి
బాలచంద్రునిచేఁత పచ్చలపిడిబాకు
మొలిపించుయశము నాదెలకుఁ బోసి
యెఱ్ఱగడ్డపాటిలో నొఱిఁగిన తెలుఁగు మ
న్నీలశౌర్యంబు మానికలఁ గొలిచి
వేమన్నయోగి గుప్పినజాళువా కైత
తులము వేయివరాలు విలువ సెప్పి

భాస్కరుని దాన ధారా ప్రవాహ సమితి
నబ్ధినాథున కిడి వివాహం బొనర్చి
పేరు వ్రాసిన వీర గుంటూరుక్షితికి
సతు లొనర్పని యాంధ్రమానసము గలదె? ౧

ఱాలకు వన్నె నిచ్చు నమరావతిశిల్పులనేర్పు పెంపు, దే
వాలయగర్భముల్ వొగడ, నభ్యుదయంబునఁ గృష్ణవేణిలోఁ
వాలుగచేపతళ్కులకు వంకలు దిద్దిన సుప్రతిష్ఠలోఁ
దేలినరెడ్డిరాజులసతి న్నుతియింపని, భూము లున్నవే? ౨

అల కృష్ణాజలధార, పెంపకము సేయం బండు, బంగారుతీ
గల మాగాణులు పట్టుచీరలయి శృంగారింపఁగాఁ, బూర్వరా
జుల దోశ్శౌర్యము లుగ్గడించెడు రణక్షోణీస్థలుల్, రత్నభూ
షలుగాఁ బొల్చెడు వీరభూమినిఁ బ్రతిష్ఠాజ్యోతి వెల్గించెదన్.

కలఁతన్ జెందిన తొంటి నాగరికతాగంధంబు, జీరంగి ఱె
క్కలరైకల్ ధరియించి, మోటుసొగసుల్ గైసేయు నాసామిక
న్యలతోఁ డాఁగుడుమూతలాడఁగని, యానందించు గుంటూరు[మం
డలముం గన్నుల కద్దుకొన్నవి, కవీంద్రస్వర్ణపద్యావళుల్. ౪

తలపోయం గవిసార్వభౌముని మరందస్వాదుకావ్యంబు ల
ప్పలనాటం గల జొన్నబువ్వకు, గురుత్వప్రాప్తిఁ గల్పించి, పూ
విలుకానయ్యకుఁ గూడఁ గొంతరుచిఁ జూపెం దింత్రిణీపల్లవం
బులతో బచ్చలికూర, చిత్రములు మద్భూమీచరిత్రాంశముల్.

## 22 సమదృష్టి

ఖద్దరుబట్టఁ గట్టికొని, కన్నుల నీరము చిందిపాఱ, నీ
ముద్దుకుమాళ్లతోఁ జెఱకుఁ బోయెద వేటికి? తల్లి! పూర్వపుం
బెద్దఱికంబుఁ దెచ్చుకొని పిల్లలతో సుఖియింతు వందువా?
వద్దు, వృధావ్యధల్, భరతభామిని! వింధ్యధరాధర స్తనీ! ౧

పూర్వకాలచరిత్రముల నిద్రితములైన,
శుభదినంబులు లెక్కఁజూచుకొనుచు
భూగర్భమున రత్నములలోనఁ గలసిన
కఱకువీరుల కొడుగఱచికొనుచు
చెదపుర్వు పొట్టలో జీర్ణించిపోయిన
వాఙ్మయంబునకు వివాదపడుచు
గజవాహనములపై గజనీకిఁ బోయిన
పసిఁడికి గుండెలు బాదుకొనుచు

పొట్టనింపుల నాటకంబులఁ జరించు
కొడుకులకు స్వేచ్ఛ లేదని కుందె దేల?
స్వేచ్ఛ లేకేమి సోదర ద్వేషమునకు?
తిరిగిచూడుము నట్టింటిదెబ్బలాట. ౨

కలమునఁ గీర్తిశేషులకుఁ గాయము లీయ సమర్థులైన బ్ర
హ్మలు కవిరాజు, లట్టిడుల కన్నము లేదుగదమ్మ! దేశభా
షలు విలపించుచున్నవి, విజాత్యభిమానము చెంగలించె, నో
చలిమల మేల్మ్రసుంగుదొరసాని! కుమారుల దిద్దుకొందువా?

విమలతపంబునం బురిటి బెబ్బులికంటి కహింస నేర్పు, సం
యములను గన్నదానవుగదా ? జననీ ! భవదీయ పుణ్యగ
ర్భమున నగస్త్యసోదరులు భ్రాతృవిరోధులు పుట్టి రేలనే ?
అమరనదీదళత్కమలహార ! యచంచలధర్మ గామినీ ! ౪

సమవర్తిప్రియసూనునేత్రయుగళిన్ సందీపితంబైన ధ
ర్మముతూర్యధ్వనిఁబోలిభారతకథామధ్యంబునన్ మ్రోయు, నా
సమభావం బిపుడేది ? స్వార్థయుత వాచారూపముండాల్చె, నో
సమశీతోష్ణసుఖప్రదాయిని ! అహింసాలోచనోద్భాసినీ ! ౫

చక్కనికవితకు, కులమే
యెక్కువతక్కువలు నిర్ణయించినచో, నిం
కెక్కడిధర్మము తల్లీ ?
దిక్కుంజరవేదికాప్రతిష్ఠితగాత్రీ !

---

## 23. పశ్చాత్తాపము

మును తెరచాటునన్ జరిగిపోయిన కర్ణునిజన్మగాథ, యే
మని వివరింతురా ! శమనజా ! యతఁడే, భవదగ్రజుండు, నా
కును రవికిన్ జనించి, ధృతిఁ గోల్పడి డాగినమందభాగ్యుఁ డ
య్యనజునియెంగిలిన్ గుడిచియే కద పొల్చె, భవచ్ఛరీరముల్ !

భాస్కరసుతుండు, నాదుగర్భమునఁ దొలుతఁ
గునికి, నిద్రించి, లేచిపోయినయనంత

రమునఁ బొడమిన లేఁత దేహములు మీవి,
వాని జ్యేష్ఠత్వమే, నీకు వచ్చె నన్న ! ౨

ఎందుకు గంటినో; తెలియ దీ యినబింబసమానమూర్తి, నా
క్రందన మాచరించు కసుగాయను, కుండలమండితాంగుఁ గా
ళింది కొసంగితిన్ జవుకళించెడుదుఃఖముఁ గ్రుక్కుకొంటి, నీ
కుందు గతించునే! తలఁచుకొన్న సహించునె! మాతృగర్భ
[ముల్ ?

"సి కన్యాత్వము మొక్కవోదు విను కుంతీ ! " యంచు,
[నేరీతి న
న్నూకొట్టించెనో భానుమంతుఁ,డొకవిద్యుత్సన్నిభాంగుండు,ది
వ్యాకారుండుదయించెఁబుత్రుఁడు,కుమారా! వాఁడెకర్ణాఖ్యుఁడై
శ్లోకాకింబలె నయ్యె, వీనిమృతి కేనే హేతువున్, ధర్మజా ! ౩

కానీనుం డనుచెచ్చనైనపలు కాకర్ణించి, లజ్జాముఖుం
డై, న న్నేమి శపించియుండునొ; తనూజా ! "దానకర్ణుండ వ
న్నా ! నాకొంగున భిక్షపెట్టు"మని నే నర్థించినన్ నవ్వి, ఆ
హా ! నన్నుం గృతకృత్యఁ జేసినవిధం బాత్మం బ్రబోధించెడిన్.

అకటా ! యెన్నిదినాలు దాతును గుమారా ! ధర్మజా ! మర్మభే
దకమై, పొంగులువాఱుకర్ణునిచరిత్రం బా నిగాలంబజే
వికి, మీయన్నకు, స్వర్గసౌఖ్యములుగల్పింపంగదోయీ! తిలో
దకదానం బిడి, కొంత నాదగు మనస్తాపంబు చల్లారెడిన్. ౪

---

## 24. క్రీస్తు

నిను వెన్నాడి నభంబునం దమలకాంతిం జిమ్ము నక్షత్రమున్
గని, రాజన్యులు తల్లడిల్ల, మరియాగర్భంబునం బుట్టి, బొ
ట్టనవ్రేల్చీకుచు, బేతలేముపురి గోష్ఠంబందుఁ బన్నుండు చ
క్కనివాఁడా! ఎవరయ్య నీవు? పరలోకంబింపు నర్తించెడిన్.

తొలి, నీదర్శనమిచ్చి గొల్లలకుఁ జేతోమోదముం గూర్చి, జ్ఞా
నుల రావించి, పసిండికానుకల సందోహంబుచే నంది యె
ద్దులకొట్టంబునఁ దొట్టిలో నొక దరిద్రుంబోలి నిద్రించు ము
ద్దులపట్టేఁడా! ఎవరయ్య నీవు? మొరసెన్ ద్యోవీధిఁ దూర్యధ్వనుల్.

"పరమంబైన విశుద్ధవర్తన మదంభప్రేమయున్ దాల్మియున్
మరియాకన్యకుఁ జిట్టిపాపఁడు వలెన్ జన్మించె" నంచుం బసుల్
గర మన్యోన్యము ముచ్చటించుకొనులీలన్ నిక్కి 'అంభా' యటం
చఱచెం బుచ్ఛము లూఁచి నీకెలఁకులం దాలానబద్ధంబులై.

ఒకచెంపఁ గొట్ట వేఱొకచెంపఁ జూపించి
పరమశాంతము స్పష్టపఱచునాఁడు
పరుల నిన్నుంబోలి భావించి మన్నించి
ప్రేమపుష్పము సమర్పించునాఁడు
పేద సుంకరియింట విందులో భుజియించి
సమదృష్టిమహిమంబుఁ జాటునాఁడు
శుభ్రాంశుకమున శిష్యులపాదముల నద్ది
నమ్రభావము నుర్వి నాటునాఁడు

నీవు నిలిచిన పున్నెంపు నేలమీఁద
చిఱునగవు మీఱ మొలిచిన గఱికిపోఁచ
యెండిపోలేదు నేఁడు శ్రీయేసునాథ !
వచ్చిపోవయ్య ! మాయింటివఱకు నీవు. ४

ఏ దేశంబున నీ సుబోధనలు, వాహిన్యాకృతిం దాల్చి, నా
నాదేశంబుల విస్తరించి, భవకాండజ్వాల చల్లార్చెనో!
ఆదేశంబె, త్వదీయరక్తనదులం దాప్లావముం జేసె, నిం
దేదో, వేదరహస్య మున్నయది తండ్రీ! క్రీస్తు! మృత్యుంజయా.

కఱకుంబల్లెపుఁబోటు, నీయెడమప్రక్కన్ దాకఁ, గ్రొన్నెత్తురుల్
గురిసెన్ గుండెలనుండి నీవపు "డనుంగుందండ్రి! నీబిడ్డలన్
గరుణింపందగు" నంచుఁ బల్కిన యమూనంబైన నీయోర్మికిన్
ధరణీధ్రంబులు బ్రద్దలై కరఁగలేదా ? పొద్దు చల్లాఱదా ?

సాలొమోను గుడికుడ్యములఁ బ్రతిధ్వనియించు
భవదీయబాల్యవిద్వజ్జయంబు
గాలిలీలసముద్రకల్లోలపంక్తిని
గద్దించు నీ యధికారరేఖ
శవకదంబములకు జవసత్వముల నిచ్చి
బ్రతికించు నీ దివ్యవాఙ్మహత్తు
జలరాశిమీఁద స్వేచ్ఛావిహార మొనర్చి
యలరు నీపాదచిహ్నములవరుస

చెప్పి, చూపించి, మా ఫలస్తీనుభూమి,
పొంగిపోవుచు నున్న దిప్పుడునుగూడ

ప్రేమతత్త్వంబు రూపించి విశ్వములను
కౌఁగిలించిన నిన్ను నేఁ గౌఁగిలింతు ౯

## 25. వీరపూజ

ఇలను భరింపనై, పెరుఁగు నేనుఁగుపిల్లలవంటి పాండుపు
త్రులు, గరిడీలలో గురునితోడఁ బరిశ్రమ సేయుచుండఁగా
మొలక మెఱుంగుఁ జన్నుఁగవమోసల గగ్గురుపాటుఁబూని, కౌఁ
గిలి యిడినట్టి దిగ్విజయగేహిని! ఢిల్లికి నీకు సేమమా? ౧

తళుకుంగత్తులయుక్కుపుష్పొడులు చిందన్ దాఁకు కౌరవ్యసే
నలతోఁ బోరు కిరీటిపుత్రుఁడు, ప్రచండంబైన తేజంబునన్
జలజవ్యూహముఁ జీల్చి చిక్కువడి ప్రాణత్యాగముం జేయ, గు
బ్బలువాంగం దలఁ బ్రాలువోసితివి రంభా! యెంతపుణ్యాత్మవో!

ధరణిం గ్రుమ్మరు వింతభాస్కరుఁడు రాధాపుత్రుఁడానాఁడు సం
గరభూమిన్ బహువీరసైనిక శిరఃకాండంబుఁ జెండాడుచో
నరుణుండుం గనుసన్న సేయఁగ విషాదావాప్తితో నీకుఁ జె
చ్చెర నుప్పొంగిన చేపుఁబాలకుఁ, జెమర్చెన్ రాలు, కుంతీసతీ!

కదలెడు పండుటాకువలెఁ గార్ముకమున్ ధరియించి, క్రీడికే
ల్గదలుపసీక యమ్ములు వెలారిచి, వహ్ని శిఖాచయంబునాఁ
బొదలినవాఁడు, మూఁడుజగములదలక్రిందులు చేయఁజాలుమా
ముదుసలి బ్రహ్మచారి పడిపోయినభూములు పూజనీయముల్.

లీల, ననేకమానవకళేబరముల్, నులివెచ్చనెత్తుటన్
దేల, నఖండచండకరతేజుఁడు, పార్థుఁడు గాండివంబుతో
నాలములో నటించుసమయంబున, నింద్రునివేయికన్నులన్
రాలినమోదబాష్పములు రత్నములై నిలిచెం, బయోధులన్.

నెఱికురులమీఁద, బంగారునీలమణులు
వెలయుచందాన, నెమిలికన్నులు రహింప
వెన్నుఁడు రథంబు నడిపిన వీరభూమి
స్వచ్ఛమానస గంగమ్మ సంచరించు. ౬

## 26. ఆంధ్రభోజుఁడు

ఇపుడా కృష్ణధరాతలేశ్వరుఁడు లేఁ డేమాయెనో! నాటి యు
ద్ధపు ఢంకానినదంబు, మా తెలుఁగువిద్యాభారతీనాట్యమం
టప, మయ్యష్టదిశామదేభముల క్రీడారంగ మెందున్నదో!
విపులాసుందరి దాఁగిలించినది, తద్వృత్తాంతమాణిక్యముల్.

పోటరి కృష్ణరాయనృపముఖ్యుఁడు ఖడ్గముఁ బట్టినాఁడు, కుం
జేటికిఁగూడఁ బౌరుషము నిండినగాథలు సెప్పి మీసమున్
దీటిన, తెల్గువీరులకు, నేఁడు కనుంగవ చెమ్మగిల్ల, వ్యా
ఘ్రాటము గూడుగట్టె నవురా! యతఁ డెక్కినసింహపీఠికన్.

కాలము చక్రముంబలె, నెకాయెకి డొల్లుచుఁ బోవుఁగాని రా
జాలదు వెన్క కొక్కనిముసంబు గతించిన, దీనిగర్భముం
జీలిచినన్ గనంబడు, నశేషమహీతలవృత్త, మిందులో
మూలుగుచున్న దాంధ్రులవిభూతి, శతాబ్దపరంపరాహతిన్.

కడ చూడంబడరాని కాల మనురక్షఃకాంత గావించు గా
రడియం దద్భు తెడారు లైనవి, విచిత్రస్వప్నవృత్తంబులై
నడచుం బెద్దలజీవితంబు లిపు, డీ నాట్యంబునం దెన్నఁడో
కడచెన్ రాయలవారిరాచటీకక్షం గళ్యాణగాథాంకముల్.

వలపోయుం దలపోసి నేటికిని, పంపావీచులం దామరా
కుల నీడం గొలువైనచేఁప, లిపు డుద్ఘోషించెడిన్ గోటగో
డలలో సీలపురుంగు, లాంధ్రుల ప్రతిష్ఠాజ్యోతి చల్లాఱెనే?
బలియై పోయెనె? కాలభూతమునకుం బ్రాచీనరాట్సంపదల్?

ముదమున గండపెండియరవుం జిఱుగజ్జెలమ్రోఁతతోఁడ, నీ
సదనమునందుఁ గ్రుమ్మరు లసత్కవితాసతి తాతగారి య
భ్యుదయమువిన్న, నాహృదయమూరకపొంగులువారి,నాఁడునే
నుదయము నందనైతిననియున్ దలఁచున్ నులివెచ్చయూర్పులన్.

పసిఁడిమూటలు వీపులపై నటింప
నాంధ్రకవికుమారుల సాఁగనంపినావు
అపుడు పుట్టిన కవులభాగ్యముఁ దలంచి
యేడుగ ఱతురు నిర్భాగ్యు లాధునికులు. ౭

ఎనిమిదిమంది దిగ్గజము లీవల నావల నిల్చి, విశ్వమో
హనకవితామధూళిమ వియన్నదుల న్నిను ముంచి తేల్చినన్
దనియక, క్రొత్తక్రొత్త కవనంబునకుం దలయూఁచి, చేయిసాఁ
చిన నినువంటిరాజు, కవిశేఖరుఁ డింకొకమాఱు పుట్టునే? ౮

సుందరములైన కబ్బము
లంది బహూకృతు లొనర్తువఁట! పాదము లం

దండియలు దొడిగి స్వాయముగ ;
నెందుంటివి ? కృష్ణరాయపృథివీశమణీ ! ౯

మనుచరిత్రమునఁ బెద్దన పోఁతపోసిన
కృష్ణరాయని లసత్కీర్తినగరు
ముక్కుతిమ్మన తెల్గు భూఖండమున నాటు
పారిజాతమహీజపరిమళంబు
వరదరాజమ్మ కంబముపొంత నిలిపిన
మగనిపేరిటి సుధామలసరస్సు
ఆంధ్రభోజునికరం బభ్యుద్ధరింపఁగాఁ
గులికి నవ్విన తొంటి తెలుఁగువాణి
కాలధూర్తాంగనావక్త్రగహ్వరమున
సమసిపోవునె ? భువన ముచ్చలిత మైన,
వార్ధకంబును, మరణ, మెప్పటికి లేదు
ఆంధ్రరాజుల లీలావిహారములకు. ౧౦

## 27. మాం పాహి

ఏదీ! నా కిఁక స్వేచ్ఛ ? యీభువనమధ్యేమార్గయానంబునం,
దీదార్భాగ్యపుజిహ్వ కట్టువడిపోయెన్, శుష్కవేదాంతముల్,
బూదింబోలిన వర్ణభేదమును, నేఁడో! రిత్తసిద్ధాంతముల్
నాదీపౌభవనంబులో వెలుఁగుజ్ఞానజ్యోతిఁ జల్లార్చెడిన్. ౧
ఒమరుఖయామ్ముబోధ విని, యుబ్బిళులూరుచు, వెన్నరొట్టెతో
సుమరస మానినావు, వెలసుందరి సిద్ధముసేయు మాంస ఖం

డములు పులావుతో మెసవినాడవు, స్వర్గసుఖంబునందు భా
గముగలదందు,వియ్యాదిదగాయగు,మానుముపిచ్చియూహాలన్.

వాసించున్ జెలి! నీకనుంగవను కైవల్యంబు, నీ దృష్టికిన్
దాసత్వంబు వహింతు నంచు మధురద్రాక్షారసం బాను, భో
గాసక్తుండు మహానుభావుఁ డని, వ్రాయంబూనినా, రీకవి
వ్యాసర్షుల్, పరియింపఁజాల నీఁక మిథ్యాభారత గ్రంథముల్.

ఈరహదారిలో నడువు, మీశ్వరదర్శన మబ్బునంచు, నా
ధారము లేని పుక్కిటికథల్ వినిపించెడి మోసగాఁడ! ధి
క్కారము చేయు తెల్లదొరగారికి ముచ్చెలు మోసి, మిత్రునిన్
జేరువ నున్నవాని నిరసించెద వెక్కడి వైపరీత్యమో! ౪

అనృతపిపాసి! యే చెఱకునందుఁ దయారగునోయి! నీవు నే
ర్చినపలుకుల్? దుబారుగ నశించిన రాజుల జీవితంబుతో
మనకుఁ బనేమి? తెల్లనిసమాధినిఁ బోలిన నీచరిత్రచే
మనుజులు మోసపోయిరి, ప్రమాదము లీవిషపుప్రసంగముల్.

## 28. రత్నచ్యుతి

ఒకరత్నంబును జేతఁబట్టుకొని, యూరూరం బ్రదర్శించి, చా
లక, ఖండాంతరసీమ లెక్కి, నిజవాల్లభ్యంబు నూరించు సా
ర్థకతాదివ్యకుటుంబినీమణి, మదాంధత్వమ్మలతాతన్వి, యా
మొకరత్నంబును బాఱవేసికొనె, నయ్యో! యెట్లు శాంతించునో!

రతనము జాతిపోయినదిరా! సుకుమారకుమారులార! మీ
యతనము లింకి సాధ్యపడ, వాంధ్రధరాతల మెల్లఁ జిక్కటం
ధతమసవారిలో మునిఁగెనా? మనగాంధికిఁ జెప్పినారా! లే
దో! తెలుపుఁడంచుఁ గేకలిడుచున్నది చూచితిరే ధరాసతిన్!

ముప్పదియెన్మిదేండ్లు నిను మోసినయాంధ్రధరాపవిత్రికిన్
గొప్పన దిద్దిపోయితివి, కోమలకాంచనదామకంబు, నీ
యొప్పును, సత్కళాప్రతిభయుం గల కొండొకయాంధ్రవీరుఁడిం
కెప్పటికిన్ జనింపఁగలఁడే? జనియించినయేని దక్కనే?

నినుఁ గామించిన కీర్తిగోపికలు, నీ నిర్యాణవార్తాహతా
ఘ్ననబాణంబున అొమ్ము గ్రుద్దుకొని, నీ గంభీరగాథావిమో
హానబృందావన వీథులం బరువులేయన్ జొచ్చె, నీశోకవా
హిని నేరీతిఁ దరింతురో, తెలియదోయీ! రత్నగోపాలకా!

కృష్ణవేణీతరంగిత తరంగములందు
దేశీయగానంబు దిద్దినావు
జాతీయపౌరుష స్వచ్ఛందరక్తంబు
చీరాలరణసీమఁ జిందినావు
పులిని గ్రుద్దుకు జంపఁ గలదేహదార్ఢ్యంబు
మును బందిలో ధారవోసినావు
శతకోటిమన్మథస్వర్ణ సౌందర్యంబు
పీడరోగమున కర్పించినావు

పలుకుపలుకున హాస్యసంపదలు గురియు
సహజమైదుష్యమునకు నిచ్చలును పొంగు

నాంధ్రసోదరలోక మల్లాడ నపుడ
స్వర్గ మెక్కితి వేల? గోపాల, నీవు! ౫

బహువిధంబుల గ్రుక్కఁబట్టి యేడువఁజొచ్చె
సగమైన నీదు దీక్షాకుమారి
పాడెకట్టెలమీఁదఁ బడి మొత్తుకొన సాఁగె
దిక్కు లేని భవత్సతీలలామ
హృదయంబు బ్రద్దలై పొదల, దిక్కులు సూచె
మితిలేని నీబంధుమిత్రకోటి
ప్రకృతిసుందర వైభవం బేది, కళ దప్పె
క్షేమాంకమైన నీ రామనగరు

దాసు వోయిన యల కల్కతాపురంబు
పగిది, గుంటూరుపురి శోకభరిత మయ్యె,
నయ్యయో! ఆంధ్రరత్న! నీ యాగమమున
స్వర్గపట్టణ మానందభరిత మయ్యె. ౬

ధనవంతమైన లండనుపట్టణమునందుఁ
దెల్గునేలకు వన్నెఁ దెచ్చినావు
స్వాభిమానముఁ జాలు వంగరాష్ట్రమునందు
గౌరవాభ్యుదయంబుఁ గాంచినావు
రాజమహేంద్రపురాన "యల్టీ" దాక
సిరిమీఁదఁ బౌరంబుఁ జెప్పినావు
ఒక యుపన్యాసంబునకు నూఱుఁబదునార్లు
గాఁ గట్నములు మూటఁగట్టినావు

పెదవిఁ గదలించి, నీవు నవ్వింపనట్టి
భారతీయుఁడు, నొక తెల్లవాఁడు లేఁడు,
ఇంతచాతుర్యజలనిధి వింతలోన
రూపుమాసితివే, రత్నరూపకృష్ణ!

భౌతికశారీరపంజరంబేకదా?
చితిమీఁద దగ్ధంబుఁ జేసినావు
క్షణభంగురంబైన సౌందర్యమేకదా?
మృత్యుదేవతకు నర్పించినావు
కంటికిం గనరానికంఠస్వరమెకదా?
కాలవాహినిలోనఁ గలిపినావు
ఊటాడి జాలు నాయుర్దాయమేగదా?
వెఱ్ఱిబ్రహ్మ మొగాన వేసినావు

మరణధాటికి, జరకుఁ, దత్తఱముపడని
తతయశఃకాయ మిప్పుడు దాల్చినావు,
ఇపుడు జీవించియున్నాఁడ వింద్రసభకు
రత్నదీపంబు లేని కొఱంతఁ

మహితస్వరాజ్యోద్యమము పోరి కదురెక్కి-
మడమ ద్రిప్పని వీరమండనుండు
గాంధిభక్తునిజిహ్వఁ గదలించి, వెలలేని
రత్నంబుఁ గొన్నసార్థకపురుషుఁడు
వాసికెక్కిన నేర్పుమూసలో గుండెజా
ల్గరఁగింపఁజాలు నఖండవక్త

పరుల వంచించు టక్కరిభక్తులకు నల్గి,
కొఱడాలు సృష్టించు గుణవిభుండు
దినము గడచుట కింట బత్తెంబు లేక
నిత్యసంతర్పణంబులు నెఱపుభక్తుఁ
డాంధ్రవైభవధ్వజ మూడి యవనిఁ గూలఁ
గూలిపోయెనె' మా రత్నగోపకుండు.

29. శబ్దశాసనుఁడు

మాసిపోయిన శిలాశాసనంబులమీఁదఁ
దరువోజ వోలి ప్రత్యక్ష మగుచు
ద్రవిడభూపతుల బాంధవ్యంబుకతమున
ధ్వని సన్నగిలి నంగిదాన వగుచు
రాటాలకడఁ గూనరాగాలు పచరించు
బండుటవ్వలనోట బయలువడుచు
ఇంటింటికడ బిచ్చమెత్తుజంగముల గు
మ్మెటపాటలో మిట్టిమిట్టిపడుచు
పొలుపు దఱిఁగిన నిన్ను నభ్యుద్ధరింప
రాజరాజులసభఁ గప్పురంబుతోడ
నందుకొన్నాఁడు తాంబూల మాంధ్రవాణి
శబ్దశాసనకవిలోక చక్రవర్తి.
శబ్దసాధుత్వంబు సాధింప భ్రష్టవా
జ్మయమహాటవి నెంత నవసినాఁడొ!

ప్రబలదుర్భరకథాపదకంబు గుదిరింపఁ
దలవాయ నెన్నాళ్లు తలఁచినాఁడొ!
గౌతమీగంగ యంగము నంటి దీవించి
పనుప, నేరేవున మునిఁగినాఁడొ!
పసుపు రాచిన తాళపత్రంబు చేఁబూని
శ్రీకార మేనాఁడు చెక్కినాఁడొ!

తెలుఁగునుడికారమున నమృతీకరించి
భారతామ్నాయమునకు జీవముల నూఁది
తేజ ముడిగిన స్వీయజాతీయరక్త
నాళములు పుల్కరింప గానంబుఁజేసె ౨

వేఁగిరాజులసతీవితతికి గరువంపు
నడక నేర్పినది నన్నయ్యరచన
తెనుఁగుభాషాపద్మమునకు జాఱినవన్నెఁ
బట్టించినది కవిబ్రహ్మపలుకు
కంచుఢక్కల నోరుగట్టించి జయకేత
నముల నెత్తినది శ్రీనాథుజిహ్వ
ప్రతిలేని యపవర్గపదవివంకకు రహా
దారి దీసినది పోతనచరిత్ర

విజయనగరాధిపుల భుజావేదికలకు
నందలంబులు మోయు మర్యాద గఱపి
తనివిఁగొన్నది మొన్న పెద్దనకవిత్వ
మాంధ్రభారతీ! నీ తేజ మద్భుతంబు. ౩

---

## 30. అయోమయము

"నా కవిత్వంబునందు రత్నములు గలవు,
వానిఁ బెకలించి చూపెడువాఁడు లేఁడు
కాల మిట్లున్న" దని మొనగాఁడు వోలెఁ
బలుకుకవిగాఁడ! యేటికి స్వాతిశయము? ౧

ఏవీ? యా రతనంబులు
నీవే పెకలించి చూపి, నీయింటికిఁ గొం
పోవోయి! యట్లొనర్పఁగ
నీవలననె గాదొ! యింక నీల్గెద వేలా? ౨

"ఇయ్యది నూత్నపుంగవిత, యీకవనంబును జూచెనేని, న
న్నయ్యయుఁ గొయ్యవాఱి చనఁడా?" యని వెఱ్ఱిమొగాలు; [పప్పు రా
మయ్యలు, కొంపరన్నవిని, యాత్మనుబొంగెదె? వడ్లగింజలో
బియ్యపుగింజగా కిది, కవిత్వమటోయి! బడాయిఁ గొట్టఁగన్.

కమ్మనిభావము గల ప
ద్య మ్మొక్కటి వ్రాయజాల, వన్నిటిలో, "ము
గ్ధమ్మో! ప్రణయమ్మో!" యని
యుమ్మలికించెదవు నీదియుం గవనంబా?

ధ్వనిచేముద్దులుగాఱుభావములుచిందన్, ముచ్చటల్ సెప్పుచున్
దెనుఁగుంగబ్బపుముద్దులాఁడి, మును జన్మించెన్, గవిబ్రహ్మదా
ల్చినఘంటంబున, నీయభావకవితాచిత్రాంగి, నీతిక్కనా
మ్యానిముం దేల ప్రవేశపెట్టెదు? చిరాయుస్సారదూరీకృతన్.

వరిగడ్డింబలె, బేలవం బగు నభిప్రాయంబు గర్భంబులో
నిఱికింపంబడి, పెద్దమూఁగదయిపోయెన్ గబ్బ, మీసొమ్ములూ
సరవెల్లుల్, చరణంబు సాఁగని నికృష్టం బైన మార్గానఁ జేఁ
దఱిఁ బుట్టించెద వేల? శ్రోత్రల కనర్థవ్యర్థవాచాలతన్.

కవిసమయంబుఁ దప్పి, నుడికారపుసొంపును బాడుసేసి, నీ
వెవతుకకోసమో! కుమిలియేడ్చుచుఁ జక్కని తెల్గుకైత కా
యువులుగుదించి, యేమిటి కయోమయమున్ బొనరింతువీవు? నీ
కవనము పాడుగాను, వెడఁగా! యిఁక నేనియు రమ్ము దారికిన్.

ఇమ్మాడ్కిఁ బ్రణయమధుర ర
సమ్ముం జవిసూపి, నిన్ను సాధించుచు, నీ
గమ్మత్తు సేయు, నెవ రా
యమ్మాయి? వచింపరాదఁటయ్యా! మాతో. ౮

## 31. కళాశాల

అంతశ్శత్రుల సంహరింపఁగల బ్రహ్మజ్ఞానపాథోధి, నీ
స్వాంతంబున్ దనియించుపండితుఁడు, కృష్ణస్వామి, నీస్వామియై
చెంత న్నిల్చి, కుమారవర్గమునుదాల్చెన్, బాహుమధ్యంబునన్
సంతోషింపుము దత్తమండలకళాశాలా! విశాలాశయా!

పరువుల్ వాఱెడు నీ కుమారులసుధాభావప్రపంచంబులో
గరళంబున్ జిలికింపఁబోకుము, కళాకాంతార జీవన్మనీ

శ్వాస లీబిడ్డలు, గారడీబ్రతుకు మెచ్చంబోవ, రావేశబం
ధురముల్ వీరహృదంతరాళములు, విద్యుద్వాహినీ మాతృకల్.

తాతలనాఁటి చీఁకటిమదద్విపమున్ బొలియించి, లోకమున్
బూతముసేయ నీసుతులు పోవలె నిచ్చట శిక్షఁబొంది, కెం
జేతులు సాఁచి యంకమునఁ జేరినవీరల కందఁ జేయవే
నైతిక సాంఘిక ప్రకృత నాటకదోష విఖండనాస్త్రముల్. ౩

## ౩౨. సఖి

తూరుపు తెల్లవాఱినది, తోయజబంధుఁడు నీదుచూపుటం
కూరము దొంగిలించు ననుకొందును, ముందుఁబరిగ్రహించునా
చారము నాది, మేల్కొనుము, చల్లనిగాడ్పులునిద్ర లేచి, సం
చారముసేయుచున్నవి, ప్రసన్నములై మనకోస మంగనా! ౧

ఱెప్పలు వాల్చుకాలమును రేల ఘటించెదునిద్ర వేళ, నీ
యొప్పున కప్పగించుట కయో! ప్రతిబంధక మయ్యె నంచు నే
నెప్పుడు గుందుచుందును సఖీ! గతియించిన ఱెప్పపాటులో,
నిప్పటి నీ విలాస మొక యించుక లేఁతగదా! వయస్సునన్.

కాలముముందుఁజిక్కనని కన్నులుమూసివచించుచుండు మూ
ర్ఖాళి, యెవండు వ్రాసియిడు నయ్యది యేరికిభుక్తమౌనొ? వ్యా
లోలములైన దేహములలో సుఖ ముండదు ముందు, నర్ధచం
ద్రాలిక! గ్రక్కలింతు హృదయంబున నీహృదయంబుఁ జేర్చవే!

కేపనుమాటలో మనశరీరము సంశయ మన్న యర్థమున్
గాఁపురమున్న, దీ దినమునం గడచన్న దసంశయంబు, చా
నా! పరిపుష్టినందు ప్రణయంబును దూరము సేసికొన్నచో,
పాపమొ! పుణ్యమో! యెఱుఁగవచ్చునె? ఖేదము రాజ్య
[మేలెడిన్.

పాలకులై, ప్రపంచవిభవంబును జుర్రిన గొప్పవారి గో
రీ లవిగో! శ్మశానమునఁ బ్రేయసి! వారిప్రశంస లెల్ల ని
ర్మూలము లయ్యె, బొంది విడిపోవకముందు సుఖించువారిదే
మే లనుకొందుఁ, గాలము గమింతమురమ్ము, కవుంగిలంతలన్.

'తాళుము, తాళు'మం చొకవిధంబున నూఱటపుచ్చఁజూతువె
న్నాళులు తాళుమందువు? మనంబులు చేరువయైనమీఁద, నీ
కాలవిలంబనంబు నరకంబుగదా సఖి! కీలుగంటులోఁ
బూలు, సుగంధముం దొఱఁగిపోయిన, ముద్దునఁ దీపి నిల్చునే?
కేవల రత్నకాంతులను గేరెడు నీ జిగిమోవిగిన్నెలో
నీవఱకే మరందరస మించుక యంచులు దాఁటుచుండె, న
య్యో! వనితా! తదీయలవ మొల్కిన నేను సహింపఁజాల,నా
భావము దోసిలొగ్గెడిని బండిననవ్వున నందఁజేయవే. 2
హృదయము శాంతిలేని బ్రతుకెందుల? కూఱటఁజెందుమంచుఁబ
ల్కెడు రసవర్గవాదులు, తలోదరి! లాభము గానరాదు, నీ
పెదవులనుండి చిందిపడు, పిన్ననినవ్వును దేనెమాటతో
మెదిపినభుక్తిపాత్రము సమీపము సేయుము, కోడిగూసెడిన్
కామిని! కౌతుకంబనెడు గ్రంధము, నేటికిఁ బూర్తియైన దే
మొ! మన, కెల్లిపైఁబడఁగ నున్నది దీర్ఘవిచారమో! గృహ

రామము పూచియున్నది, కరంబున నున్నపసిండివీణతో
బ్రేమరహస్యముల్ పలుకవే! కడకన్నుల మ్రొక్కులిచ్చుచున్.

---

## 33. యుగంధరమంత్రి

అక్కటా! యుక్కుసంకెలలు హస్తములం దగిలించి, ఢిల్లి భూ
భుక్కునిసేన పట్టుకొని పోయెఁ బ్రతాపరుద్రసింహమున్
నిక్కనఖండగౌతమిని నిల్పినదాయల యోడఁజాఁప, నీ
వెక్కడ డాఁగియుంటివి? వహింపుము టక్కరిపిచ్చివేషమున్.

పౌరుషరాశి, రుద్రనరపాలుని చేతిశరంబు నాలుక
ల్గోరుచు నోరుగల్లుపురిలోఁ బడియున్నది, జేనిగుఱ్ఱముల్
ధారుణిఁ దన్నుచున్నవి, బలంబులు భీతిపిశాచివాతఁ గం
గారగుచుండె, లెమ్మిఁక! యుగంధర! ముక్తికుపక్రమింపుమా.

అదె! గోదావరి దాఁచియుంచినది, రాజాశ్రూదకం బబ్జినీ
మృదుపత్త్రాంకురహేమపాత్త్రికల, లెమ్మా! యందుఁగర్తవ్యము
న్నది, యాలింపుమి యోరుగల్లుపురి చింతాక్రాంతమై మూల్గుచు
న్నది, మంత్రీ! యిఁక నీ యలీకరచనానాట్యంబు సాగింపుమా!

లేనవ్వుల్ బలసెన్ విరోధులకు ఢిల్లీకోటలో, రుద్రభూ
జానిన్ దాయలు నవ్వులాడుకొని రాశాతాండవం బైన ప్ర
జ్ఞానైపుణ్యము మీఱఁగాఁ దెలుఁగుజెండా నుద్ధరింపంగ దే
శానందద్యుతు లోరుగల్లుపురిమధ్యన్ గుప్ప వోయింపుమా!

## 34. జేబున్నీసా

జీవితేశ్వర! మన సుధాజీవితంబు
లంతరించెనె ? యొక కౌఁగిలింతలోన,
నాథ! మన వినూతన యౌవనముల కపుడ
వయసు నిండెనె ? యొక్క చుంబనముతోడ. ౧

ఈ సులతానకూఁతు రాకతే సకలంబున మందభాగ్య, య
య్యో! సఖి! గుండెలోఁ గఱఁగుచున్నవి నీసపుకొండ, లింకినా
శ్వాసము గల్గనేర్చునె? ప్రశాంతి వహించిన నీ సమాధితో
బాస యొనర్చి చెప్పెదను వద్దిఁక నాకు సుఖప్రసంగముల్. ౨

తొలఁగె న్నాతలపోఁత లన్నియును, నీతో భస్మమై, గాలిలోఁ
గలసెన్ భావికటుంబెనిత్యము, మనఃకాంతా! దురంతవ్యథా
జ్వాలనంబే, శరణంబు నాకు నిఁక నీ బందీనిశాంతంబునన్
బలిగావింతును బ్రాణపంచకము తపంబైన నీమూర్తికిన్. 3

కవితాతూలికతో లిఖించి నిను శృంగారించి, పూజించి, మా
నవలోకంబున కప్పగింతును, మనోనాథా! వసక్షోణిలో
భవదీయం బగుమేను నాకొఱకునై భస్మంబు గావించుకొం
టివి, నే నీ ఋణ మెట్లుతీర్చుకొని శాంతింతున్ ధరామండలిన్!

మొగలు రాజన్యుని పగడాల మేడలో
వసియింప దింక నీ ప్రణయలక్ష్మి
ల్లీసవాబుల మల్లెతోఁటలవంకఁ
బరికింప దింక నీవలపుఁజిలుక

ఔరంగజేబుని యపరంజిగిన్నెలో
భుజియింప దింక నీ ముద్దులాఁడి
పాదుషానగరిలోఁ బట్టుపాన్పులమీఁదఁ
బవళింప దింక నీపాదదాసి

అక్బరాది పితామహు లధివసించు
ప్రాఁతగోరీలకడ నిన్నుఁ బాడుకొనుచుఁ
దిరుగుచున్నది నీతరి తీపులాఁడి
యగ్నిలో న న్నుపాసించు త్యాగమూర్తి! ౫

## 35. నికుంజము

ఆఁకొనియున్న తేంట్ల మధురాన్నముఁ బోకిరిగాలిపిల్ల వాఁ
డాకులపెట్టినాఁడు, చిగురాకులకోకలు గట్టుకొన్న పుం
స్కోకిలవాణి! పుష్పితనికుంజవిలాసిని! తేనె లేని పూ
రేకులశుష్కవీథుల, ద్విరేఫము గానముసేయఁ బోవునే?

బోగముసానులై, కుసుమపుం జిఱునవ్వులు చిమ్ము తేంట్లకున్
బ్రాగుడు నేర్పుచుందురు గదా? వనకన్యలు, కాకిగూఁటిలో
మూఁగతనంబునం బొదలు ముద్దులకోకిల, పాట గట్టి, మి
మ్మాగము సేయుచున్నది, గయాళిసుమీ! మధుమాంస
[సంగతిన్.

## 36. హిందూరమ

ఖాదీరాటపు వింత తుమ్మెదలు ఝూంకారించె, నీ యింటిలో
నీ దారిద్ర్యము గోఁచిపాతవలెఁ బన్నెఁ గాంధిబైరాగి, బా
లాదిత్యప్రభతోడ స్వేచ్ఛ యను సంధ్యాలక్ష్మి రానుండె, నేఁ
డేదీ! తొల్లిటిమందహాసముల మమ్మీక్షింపు హిందూరమా!

నీగర్భంబున గాంధి పుట్టినపుడే నీకష్టముల్ చుట్టలై
యేగెన్, గుండ్రనిబల్ల లేఱుపడి పోయెఁ సీమదేశానఁ గా
కైగోసాయి పిసాళిన వ్రేటుల మోహింపించె ముల్లోకమున్?
సాఁగింపంగల వింక శాంతియుతసంసారంబు హిందూరమా!

తల్లీ! నీతలమీఁద శాశ్వతసమాధానంబు ఘోషించు, మే
లుఁళ్ళాయింగని నవ్వోన్నజను లాంగ్లుల్, నేఁడు నీపుత్రి నిన్
లిల్లీపూల నలంకరించి, నుడు లాలింపంగ నున్నారు, నీ
ఝిల్లీగుండెలు నిబ్బరించుకొని, చెండింపింపు మస్పృశ్యతన్. 3

Printed by Vemkatram Power Press, Ellore.
P. I. C. No. W. G. I. Dec. 46/1000 Copies.

# ఖండకావ్యము

## రెండవ భాగము

రచయిత

కవికోకిల, కవితావిశారద, ఉభయభాషా ప్రవీణ

జి. జాషువ కవి

పబ్లిషర్సు:

వేంకట్రామ అండ్ కో.,

బెజవాడ – మద్రాసు.

1946



[వెల రు ౧—౦—౦

## అంకితము

కలవా, రాంధ్రనియోగిభూసురులు, నే
కావంశజుల్, న్యాయవా
దులు, గుంటూరి నివాసులున్, సమ సుబు
ద్ధుల్, దండయాభిఖ్య్యా, లు
జ్జ్వలధీశాలురు, వారితండ్రులను సు
బ్రహ్మణ్యులం బెండ్లియై
కులుక న్నేర్చినకావ్యగుచ్ఛ మిది నా
కుం గూర్చు నానందమున్.

# వి ష య సూ చి క

# విజ్ఞప్తి

పవిత్రలోకమునకు—

కాలముతోఁబాటు ప్రజల యభిరుచులు మాఱినవి. కవులు విశృంఖలవిహారము సేయుచుఁ బలుపోకలఁ బోవుచున్నారు. గంగ, త్రిపథగ యయ్యును సముద్రముననే కలియునట్లు, కవిత యెన్ని పెడత్రోవల నడచినను రసానంద సముద్రమున సంగమింపవలయునుగదా? అది లేనివ్రాఁతలు తలవ్రాఁతలని పెద్ద లందురు. ఈ యిరువదవ శతాబ్దమునఁ గనులు దెఱచిన నవయువకు లీకబ్బపుందుపానఁబడి కలవరపడుచున్నారు. ప్రామాణ్య మేదని ప్రశ్నించుచున్నారు. గ్రంథకర్తల సమాధానములతో నెంతవఱ కేకీభవించుచున్నారో తెలియదు ఇట్టి సందిగ్ధకాలమున నుద్గ్రంథరచనకుత్సహించువాఁ డెవఁడు? వ్రాసినఁ జదువునోపిక పాఠకున కెక్కడిది? కావునఁ బ్రజాభిరుచికి నుచితము లగు చిన్ని చిన్ని వ్యాసములు గల భారతివంటిపత్రిక లవతరించినవి. నేఁడు పరాధీనుఁడైన తెనుఁగువాని కిట్టిఖండకావ్యములు నిమిషముల మీఁద ముగిసి తీఱుబడివేళల నింపుసేయుచుండును.

ఇది నాకావ్యశకలముల రెండవ ఖండము. మొదటి భాగముతోఁబాటిదియును నజ్ఞాతవాసమును ముగించుకొని వెలువడి నా శ్రమను సార్థకముఁ జేసినది. పేటికావాసము చేయు నారచనలు చూచుకొని,

"ఆలయమం దహ దిగ్రితములై. తెరచాటున దాగియున్న బి
బ్బిలవిధాన" మత్కృతులు పెక్కులు వ్రాఁతలతోఁ గృశించుచున్
జీలికలయ్యె, సద్ధతి నశించె, విచారము కాఱుచీఁకటిం
బోలి యెడందలో నిలిచిపోయె, సుమింకవు క్రొత్తకబ్బముల్"

అని యొకపరి, నిట్టూర్పుఁ బుచ్చితిని. నాయం దనుగ్రహ ముంచి, నా యీ రెండు కబ్బములను దమ జననీజనకులకుఁ గృతి నిప్పించి ముద్రింపించిన దీనబాంధవులు, న్యాయవాదులు, సంపన్నులు నగు మ రా శ్రీ ఏకా దండయ్య పంతులుగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇట్టి కుమారమౌక్తికముం గన్న శ్రీ ఏకా రుక్మిణీ సుబ్రహ్మణ్య దంపతుల కంకితముచేయఁబడి నాకృతులు ధన్యాకృతులైనవి. పరమపదించిన వారి నామము లీకృతిముఖమున నాచంద్రార్కము నిలుచుఁగాక! ఉత్తమకవు లనేకులు తెలుఁగుశారద నెన్నియో సత్కృతుల నలంకరించి కృతకృత్యులైరి. నా యీయలఁతికావ్యములు భాషాదేవికి ముక్కుపుడక యగునో, ముంగర యగునో!

గ్రంథకర్త.

# ఖండకావ్యము

## రెండవ భాగము

### 1. భరతమాత

ప్రమథనాథుని నీరు ద్రావింపఁజాలిన
వజ్రాలకొడుకులఁ బడసినావు
నరకాధిపతిగుండెఁ గరగింపఁజాలిన
వెలఁదిమిన్నల కుగ్గుఁ బెట్టినావు
బ్రహ్మయంతటివాని వణఁకింపఁజాలిన
మునుల మూఁపున నిడి మోసినావు
అంటినంతన పాప మడఁగింపఁజాలిన
తీర్థకోటుల మున్గి తేలినావు

ఉర్వి బుట్టకముందె నీ వుంటి వేమొ,
సకలశాస్త్రపురాణము ల్చదివినావు
గానబుసిరి గల భాగ్యశాలినివి నీవు
భారతాంబామణీ! నమస్కార మమ్మ! ౧

జలకంబులాడించు చెలికత్తెకద నీకుఁ ?
గనకాంబుజాఢ్య గంగాభవాని
తలమీఁదిగుండుమల్లెలదండ గద నీకు ?
సత్యోన్నతోరు హిమాలయంబు

పూఁతబంగారుసొమ్ములపెట్టెగద నీకు ?
సిరివెలంది చరించు సింహళంబు
ముద్దు గాఱెడు సిగ్గొటద్దంబుగద నీకు ?
నిండారు హింమూమహాంబురాశి

ఇట్టి నినుఁ జూచి బిచ్చంబుఁ బెట్టు మనుచు
నన్ని దిక్కులు యాచించుచున్న వమ్మ !
యైకమత్యంబు గల్గి ని న్ననుభవించు
కొఱఁత పూరింపవే మాకు భరతమాత ! ౫

## 2. కృతిపతిప్రశంస

శ్రీదండార్యుని, వజ్రనిస్తులయశస్విన్ గన్న యేకాన్వయ
ప్రాదుర్భావపవిత్రవర్తనుఁడు సుబ్రహ్మణ్యసద్బ్రాహ్మణుం
డీదివ్యాస్యకుఁ గావ్యకన్యకకు, భర్తృత్వంబుఁదాల్చెన్ శుభా
పాదు ల్గారె, గతించియుం బరహిత వ్యాపారపారాయణుల్.

ఎన్నఁడో పూర్వ మందల మెక్కు నర్సు
రాజను మహామహుఁడు సమర్థత మెఱయఁగ
వ్రాసినాఁడట పెను జమాబందిలెక్క
లన్నియును నద్భుతముగ నొక్కాకులోన. ౧

ఆకౌశల్యముఁ జూచి, యప్పటి నిజామాశ్చర్యధుర్యాత్ముఁడై
యేకావా రనిపిల్చిన న్మఱిపోయెన్ గట్టుపల్యాఖ్య, యా

యేకావంశమునందుఁ బుట్టి, ధరణీబృందారకాగ్రేసరుల్,
లోకారాధ్యులు వోయి రెందఱో, బుధుల్ పూర్ణప్రభావోద
[యుల్.

ఆవంశజలధిలోపల
నావిర్భావంబు నంది రన్నమరాజుల్
గోవిదుఁడు నర్సరాజా
శావాసితకీర్తిమూర్తి జన్నమరాజుల్ ౪

జన్నమరాజగుణాఢ్యుని
కన్నకొడుకు సుబ్బరాజు గాంచెఁ దనయు వి
ద్వన్నుతుని దండలింగం
బన్నతినిధాను వంశ మానందింపన్. ౫

ఆ దండలింగనాయకుఁ
డాదర్శగుణాలవాల యను నన్నమయం
దీదండయార్యుఁ తాత మ
హౌదార్యాంచితునిఁ గొండయార్యునిఁ గాంచెన్. ౬

స్మరణీయుం డగుకొండయార్యునకు రాంచారమ్మకున్ దత్తుఁడై
మురువుం గూరిచి రుక్మిణీసతికడంబున్ బట్టి, యేకాన్వయా
భరణంబున్ మనదండనామకు నసంఘస్వాంతునిం గాంచి, యు
ప్పరలోకంబున నున్న వాఁడిపుడు సుబ్రహ్మణ్యుఁ డుత్సాహియై.

ఓ సుబ్రహ్మణ్య ! యశో
భాసుర ! నీకొడుకు విలిచి పంపినకృతి, వి
ద్యాసుందరి యిది, యమర స
భాసీమం బెండ్లియాడి పాలింపఁదగున్. ౭

తనుజుసంప్రార్థనము నన్యథాకరింప
కామమహాత్మ్యుఁడు మత్కృతిస్వామి యయ్యె,
పుత్త్రుఁ జిచ్చిన నాతొలిపుష్పసరము
నఱుతఁ గీలించినది, రుక్మిణమ్మ తొలుత. ౧౦

ఒక్కకుటుంబమందె విభవోజ్జ్వలమూర్తులు, పుణ్యదంపతుల్
చొక్కపుఁబ్రేమబంధము లుసుంత విభిన్నము గాక యుండఁగాఁ
జిక్కిరి, నాదుకావ్యసరసీరుహక్షేత్రల నాదరింప, నే
నక్కను ద్రొక్కవచ్చితి కొ, నా...ము ... ర్త ... శేషమో కదా!
ప్రణుతింపఁదగిన పితరుల
ఋణం బిటులఁ దీర్చుకొనుట లేక! విద్యా
చణుఁ డవనీసురచూడా
మణి, దండయగాక తెలుగుమాగాణమునన్. ౧౧

వినుతించుం బదివేలనాటికలతో విశ్వంభరా దేవి నీ
తనయున్ దండయనాయకోత్తముని స్వర్గత్వా నిక్షించి, చ
ల్లనివేళం దలపోసికొమ్మ, గణాంకా! యీవంశవ
ర్ధను నేపూజ యొనర్చి కాంచితివో! సుబ్రహ్మణ్యమాన్యాగ్రణీ!

కరుణ నీకొమరుండు గర్తపురిలోఁ గట్టించె నానా ముసా
ఫరు లుండం బెనుసత్త్రశాల, నట ద్రవ్యం బెంత వెచ్చించెనో
చెఱువు ల్గుంటలు బావు లెన్నియొ ప్రతిష్ఠించె, మహోదాత్తయై
చిరకీర్తిం గనినాఁడు, నేఁ డది రహించెం, బచ్చకర్పూరమై

అనదలు, గ్రుడ్డివారు, వికలాంగులు, నిత్యయుండు వెట్టు భో
జనమునఁ దృప్తులై, పలుకు చల్లని దీవెన వాక్యముల్, ప్రతి

ధ్వను లొనరించుచున్నవి కదా ? హరిదంతములందు, రుక్మిణీ
వనితకు, నీకు, నచ్చట శ్రవఃకుహరంబులఁ దాఁకుచుండవా ?

తనపుట్టువు కారణమున
వినుతిగనిన ప్రత్తిపాటిపేట నిన్న నం
దనుఁ డనుపమవితరణగుణ
సనాధుఁ డొక సత్రశాల సంస్థాపించెన్. ౧౫

ఓపికఁ బురాణకాల
క్షేపం బహరహము జరుప జీతం బిడి. వి
ద్వాంసుఁడగు నచ్చట నొక
బాపనపండితుని నేరుపా టొనరించెన్. ౧౬

విద్యార్థులకు ద్రవ్యభిక్షఁబుతోఁ గూడ
సగసాన్నదానంబు సలిపినాఁడు
కవి గతించుట వింట నవయుకబ్బము లచ్చు
పోయించి యూపిరి వోసినాఁడు
తనపేరు దెలుపరా దనెడుపరతుమీఁద
సత్కళాపోషణ జరిపినాఁడు
ప్రేమ నాకృతు లచ్చువేయించి లోకాన
సర్వసమత్వంబుఁ జాటినాఁడు

ఆర్జనము మాని స్వార్జితమైన ధనము
పుణ్యకర్మల కర్పింపఁబూనినాఁడు
ఆశ్రమము లేదుగాని ఏ యాత్మజుండు
భోగములు మానియొక వింతయోగియయ్యె.

పలుకుఁ బలికినఁ గఱకు గన్పడును గాని
వెన్నవంటిది దండయాభిధునిమనసు
'ఆదికొంచెము తర్వాత నధిక' మన్న
సూక్తికి నిదర్శనంబు నీసుతునిచెలిమి. ౧౮

సరసత్వంబునఁ గార్యదీక్షను సదాచారంబునం దన్నిటన్
దెఱవా! దండమనీషితోడ దొరయుస్నీరాజు, శ్రీరుక్మిణీ
పరిచర్యాపరితుష్టమానసుఁడు సుబ్రహ్మణ్యుఁ డేరీతిఁ గాఁ
పురముల్ జేయుదొ! పూఁతురా! కవికులంపుంగ్రొత్తముత్తైదువా!

ఒనరన్ రెండవమారు నీదుకృతి నచ్చొత్తించి, నీ కంపె నీ
యనుఁగుం బుత్త్రుఁడు, దండయాఖ్యుఁడు, కృపాయత్తాంతరం[గుండవై
కొని, దీవింపు మదృష్టవంతుని, యశస్కుం బుత్రుఁ బెంగాంచి, జా
రనివిఖ్యాతి గడించిపోయితివి, సుబ్రహ్మణ్యునీమన్మణీ!

చెంగావి పంచెకట్టును
బంగారమువంటి బక్కపలుచని తనువున్
బొంగారు వార్ధకపు సొం
పుంగల నీ సుతునిమూర్తి ముచ్చట గొలుపున్. ౨౧

కనకపు టక్కరములచేఁ
దననామం బుగ్గడించు దండయహోల్కన్
గనుఁగొని యుండెద వది నీ
తనూభవుని దాన నీరదంబున మొలిచెన్. ౨౨

## ౩. హెచ్చరిక

ఘనఘనాఘనము చీఁకటిమేడ వెలిగించు
మెఱపుదివ్వెల నూనె తఱుఁగలేదు
పవలు రాతిరి తీఱుబడిలేక ఘోషించు
తోయధీశునిగొంతు రాయలేదు
ఇనబాలకుని దినమ్మును గర్భమునఁ బూను
పొడుపుదిక్సతికాన్పు లుడుగలేదు
ఋతురాజు ధారుణీసతికి సొమ్ములు పెట్టి
కులికించుపని మానుకొనఁగలేదు

విశ్వనిర్మాతచల్లనివీక్షణమున
నేటికిని, గెంపుచాఱ గాన్పింపలేదు
మూర్ఖలోకమ! దినమెల్ల ముగియలేదు
దీప మున్నది హృదయంబు దిద్దుకొనుము. ౧

విసుగుకొనలేదు సృష్టికి విశ్వభర్త
పాలపాపలజన్మల మూలకమునఁ
దెలుపుచున్నాఁడు శాంతిసందేశములను
విశ్వమా! ధర్మమును గూడబెట్టు మిపుడ.

నమ్మకము లేని నీ జీవనమున కవధి
గుండెగడియారమున దాఁగియుండు నేమొ
లెక్క ముగిసిన నాట చాలించుకొనును
త్వరపడము మూర్ఖ! ధర్మనిర్వహణమునకు.

నాటుము విత్తనం బొకటి, నాలుగునాళ్ళకు మొక్కయై,మహీ
పాటన మాచరించుకొని వచ్చును ధర్మము దప్పకుండ, "నీ
వేటికి ధర్మముందొలగి? తేను పరాత్పరునానఁ గొంచెమున్
దాట"నటంచుఁ జెప్పెడువిధంబునఁదో చుఁగదా? నతాంగనై.

సృష్టి తనధర్మమును నిర్వహించు నన్ను
నీశ్వరుని మనఃకమలంబు తృప్తిపడదు
భక్తికిరణంబు నీలోనఁ బ్రజ్వలింపఁ
బరమపితకంట మోదబాష్పములు నిండు. ౪.

## 4. ఆంధ్రుఁడను

బహుదేశములను బేర్వడసి మీసముకీటు
భరతఖండంబు నా పారశాల
స్తనయుగంబున గానసాహిత్యములు గల్గు
భాషావధూటి నాపంతులమ్మ
సాందీపనిసమక్షమందు విద్య గడించు
వనమాలి నా సహపాఠకుండు
భక్తివైరాగ్యభావముల తావలమైన
భాగవతంబు నా బాలశిక్ష

గంటము ధరించి మోహనాక్షరము లెనయఁ
బ్రతిఫలించెడు నామహోన్నతవిభూతి
వ్రాసికొందును దశదశాఫలకపంక్తి
గడనకెక్కినయాంధ్రపుత్త్రుఁడను నేను. ౧

ఘనపురాణగ్రంథకర్త, దేవర్షి, వ్యా
సుండు మా యాస్థానపండితుండు
శివధనుఃఖండనాంచితబాహువీరుండు
భూసుతాభర్త మా పొరుగువాఁడు
ముల్లోకవిజయంబు పుంజీభవించిన
భీముండు మా యూరి సాముకాఁడు
గానవైదుషి తాలుగరఁగుభక్తుఁడు త్యాగ
రాయండు మాయింటిగాయకుండు
శీతనగశృంగసీమ నాసీమఁజేసి
యద్భుతములైనబిరుదుపద్యములు సదివి
వేడ్కఁ మ్రోయించుకొందును విజయభేరి
మడమ ద్రిప్పని యాంధ్రవీరుఁడను నేను. ౨

మాశిల్పనైపుణ్యమహిమంబు ఘోషించు
తాజమహాలు నుదాహరించి
మాకవిత్వవిలాస మార్దవంబుం జిందు
ఘనుఁ దిక్కకవిని మచ్చునకుఁ జూపి
మాధనుర్విద్యారమావైఖరిం జాటు
వీరుఁడౌ గాండీవి పేరుఁ జెప్పి
మాసతీశీలసంపద లచ్చుగుద్దించు
సావిత్రి మాంగల్యచరిత మెన్ని
భరతమాతకు గర్గురుపాటు దోఁప
గగనమండలి మాకీర్తియఁ గంఠ మెత్తి
పందె మొడ్డెద విశ్వప్రపంచమందు
నడుపుదప్పని యాంధ్రభూపుఁడను నేను. ౩

సర్వభూతముల కహింసా సూక్తి బోధించు
దయకు నాచిత్త మద్దాలమేడ
గంపు పేదలను బంగారు గుప్పిటఁ దన్ను
నీవికి నాచేయి తావలంబు
అత్యనాథులఁ గాంచి, యశ్రూదకముఁ జిమ్ము
కరుణకు నాగుండె పురిటిగీము
మంజులాలంకార మకరంద ముప్పొంగు
కవితకు నాజిహ్వ కల్పతరువు
కమ్ముకొని వచ్చు కీర్తి మేఘము లమీఁద
నములసంతోషరసవిమానముల నెక్కి
హాయిగా సంచరింతు నహర్నిశంబు
నిడుము లందని విత్తవంతుఁడను నేను.

శ్రీకృష్ణరాయధాత్రీనాయకుని సమ
గ్రప్రతాపము దీపకళిక మాకు
రాజరాజనరేంద్రరమణీయసద్యశః
కాండంబు పండు రేయెండ మాకు
మన్నె బొబ్బిలిదండిమగలదోస్సారంబు
సహజనిష్ఠురకవచంబు మాకు
అరిరాజమూర్ధన్యపరిభావపంకంబు
మురువు మీఱెడుచుక్కబొట్టు మాకు
విలసితము లైన యుద్గ్రంధములు రచించి
యుడుపథంబున వలపుటంగడులు దీర్చి
అమ్ముకొందును సిద్ధసాధ్యాంగనలకు
రాణఁ జెలువారు నాంధ్రవర్తకుఁడ నేను.

## 5. వివేకానంద

దొరసానమ్మలు బొమ్మలై, కలికిముద్దుంగన్నుల న్నిండుట
చ్చెరువుమ్మక్కువనింపఁ, జక్కఁదనముల్ జివ్వారిలేఁ బ్రాయమున్
మెఱయన్, హైందవవేదసారమును గంభీరోక్తుల న్నీపయిన్
గురియించెన్నగ, మానరేంద్రమునిచంద్రుం డో చికాగోపురీ !

దయతో నాటిసభావిభుం డిడిన, క్లృప్తంబైనకాలాన, మీ
నయగారాజలపాతవేగము నుపన్యాసంబునం బూని, దు
ర్జయవేదాంతరహస్యతత్త్వమును బూర్ణప్రజ్ఞ దీపింప, న
వ్యయవాగ్ధోరణి వెల్లడించినది, మా వాఁడే ! చికాగోపురీ !

రామకృష్ణునిదయారిశ్నసౌధమునందు
వాసం బొనర్చిన బ్రాహ్మణుండు
ముక్తికాంతాగళంబునఁ బుస్తెఁ గీలింప
వడి వంక లేక చొప్పడిన మగఁడు
కాషాయవస్త్రంబు గట్టినపదవికి
మరియాద నిల్పిన పరమయోగి
ప్రజ్ఞాబలంబునఁ బాషండమతములఁ
గారించు పండితాఖండలుండు

గంగమాంబిక హిమవదగ్రముననుండి
యవని కేగిన నాటి వేగాతిశయము
వానివాక్కున నిల్పి గుప్తంబుసేయ
సాటియెఱుఁగని వక్తృపంచాస్య మితఁడు.

"ఆ వాల్గన్నులలోని దివ్యకళ లోకాతీత, మా విగ్రహ
ప్రావిర్భావ మలభ్య" మంచు భవదీయక్షోణి కీర్తింపలే
దా? విశ్వంబులు కందిపోవఁగ వివేకానంద కర్మంది న
ప్పూవున్ మృత్యువుమెచ్చి త్రుంచుకొనికొంపోయెం, జికాగోపురీ!

ఎలఁబ్రాయంబున రోదసీకుహర మధ్యేమార్గమున్ దాటి, వే
ల్పులతో మంతనమాడునాతనియశంబున్ జూచి, యా వేయిగ
న్నులవాఁడోర్వక కొండెము ల్వలికియుండున్ బ్రహ్మతోఁగట్ట'
యచ్చెలువంపుంగని నగ్గిలోన నిడి వ్రేల్చెన్, ముప్పదాఱేండ్లకే!

తెలవార్వేళఁ గషాయదీధితుల నుత్తీర్ణత్వముం జెందు వె
లుగులజేనిం గను శ్వేతజాతులకు, మాగోసాయికాషాయకాం
తుల భ్రాంతుల్ తొలయెత్త, 'నల్ల దెః'న రేంద్రుల్, పండితుల్ గేలు మో
డ్చులమచ్చించినభారతీయముని, చూడుం'డంద్రుపట్టంధ్యలన్.

## 6. తాజమహాలు

ముదిరిన ప్రేయసీప్రణయమూర్తి, తిరోహితమైనయంతనే
యెద నపు డగ్నిపర్వతము లెన్ని పెరిల్లిన బ్రద్దలయ్యెనో
కద? మొగలాయిరాజు తెలిగన్నుల రాల్చిన బాష్పధారలే
పొదలి, ఘనీభవించినవి, ముద్దులతాజమహాలుపోలికన్. ౧

అదికదా? దేశదేశాలయంజలింపు
లందుకొన్నట్టి, శిల్పకళాపణంబు
భారతీయులగర్వ సర్వస్వమునకు
మూలకందము? మొగలుబిబ్బీలసొగసు. ౨

ఒక్కొక తాతితో నిమిడియున్నవి నేఁటికి, షాజహానుభూ
భుక్కు నెడందతో నుడికిపోయిననాడులలోని రక్తపుం
జుక్కలు, ముప్ప దేండ్లటుల స్రుక్కెనొ? తాజమహాలుబల్లెమై
ప్రక్క వసింపఁగా, జెయిలుపాలయి, పుత్రునిక్రూరచర్యలన్. ౩

అమవసనిశీథిపీసహస్రములఁ గూలి
పాడుపా పాడినాఁడు దుర్భరవియోగ
భావగీతంబులం దచ్చువడ్డ రచన
దేవి ముంటాజమహాలు నిద్రించుగోరి. ౪

ఎన్ని యుగములవఱకు సహించుకొనెనో ?
తెలుఁగు శిల్పులచాతురీవిలసనంబు
యమునయొడ్డునఁ బూఁచి దిగంతములను
యశము నించిన తాజమహాలుకొఱకు. ౫

మగనిఱొమ్మునఁ గుంపటి రగులఁబెట్టి,
కాయము త్యజించెనే! మొగలాయిరాణి
తెనుఁగుశిల్పుల పనివానితనము నొకటఁ
గుప్పవోయింపవలె ననుకొనియె నేమొ! ౬

వెడగులు పాడుపాలతల వేసిననిందల కుత్తరంబుగాఁ
బిడిచినఁ బాలుగాఱు నునువెన్నెలక్రొన్నెలజాల యచ్చపుం
బెడఁగుదనంబుతోడఁ గనువిందులుసేయుచుఁ దాజమాలు క
ట్టడము కళిందజానదిజడంబుల శుద్ధియొనర్చు నిప్పుడున్. ౭

## 7. భారత వీరుఁడు

“ఈకవచంబుఁ గుండలము లీయకు, మల్లదె దొంగబాపఁడై
నాకవిభుండు వచ్చెఁ గని నాయనుఁగుంగొడుకా!” యటంచు,మ
ర్త్యాకృతినుండి పల్కెడు సహస్కరునిం గని, నవ్వి, యవ్వియే
పోకడపెట్టు నీసుగుణము న్నుతియింపఁదరంబె? భానుజా! ౧

గంగాపుత్త్రుఁడు, రాజునానతి శతాంగశ్రేణి యర్పించు నాఁ
డంగీకారముగాక నీ కొక రథం బర్పించెనేగాని, యో
యంగాధీశ్వర! యుగ్రవత్కదనపంచాస్యంబవౌ నీకు నీ
యంగత్రాణములున్ రథంబులును సాహాయ్యంబు లేమాత్రముల్.

సంగరమందు నీకుఁ దొలిసాయకమైన భుజంగభర్త, పా
ర్థుం గుఱిసూచుచో, నది విరుద్ధగతిం జని కెక్కెముం గిరీ
టాంగదము ల్దహించి, “యినజా! ననుగ్రమ్మఱనేయు” మన్న ‘ఛీ
యెంగిలిబాణ మేయ’ ననవే, రణవీరుఁడ వీవు భానుజా! 3

నీ నేర్పున్, సహజప్రతాపవదనోన్మేషంబు, నీక్షించి, యీ
ర్ష్యానైశిత్యముఁ దోఁపనీక, కులగోత్రప్రశ్నలం దెచ్చి, ల
జ్జావిర్జ్జవునిఁగా నొనర్చెడు కృపాశ్వత్థామలే లేక, క
ర్ణా! నీ పేరికిఁ దీసిపోయెదవు? మార్తాండాత్తతేజస్వివై. ౪

అంబుజనాభునంతటి మహాత్ముఁడు పార్థుని తేరిమీఁద గు
ఱ్ఱంబులు దోలుచుండ, సమరం బొనరింపఁ దెగించునే? లలా
టాంబకుఁడైన, నీ తెగువ యబ్బురముం గలిగించు, వీరలో
కంబున నీకుఁ జాలినమగండు జనింపఁడు సూర్యనందనా!

'భారతయుద్ధరంగమునఁ బాండుతనూభవమధ్యముండో ? లేదా ? రవిజుండో? తీఱవలెఁ దధ్యము ; నా కటుగాక కంటికిన్ గూరుకు రాదు రా''దనుచు ఘోరముగా శపథంబుచేసి, నీ కూరిమిజేనికై తనువుఁగోల్పడి తెంతటి సాహసుండవో !

ఫల్గునుఁడుదక్కఁ జిక్కిన పాండుసుతులు
భండనంబున నీచేతఁ బడినయపుడు
తల్లి కిచ్చినవరము చిత్తమున మెఱసి
యడిద వెత్తని సత్యసంధుఁడవు కర్ణ ! ౭

'కుడిభుజ మైనకర్ణుఁ డనిఁ గూలె, సమస్తము దీఱె' నంచు డీల్పడి, ధృతరాష్ట్రనందనుఁడు పాండుకుమారుల కోహటించి, యమ్మడుపునఁ జొచ్చె, శూరజన మండన ! నీవు గతింపకున్న, భీముఁడు తొడ గొట్టి నీనృపునిముందఱ నిల్చి గదన్ దరించునే!

"నా యరదంబు గ్రుంగిన దనంత ! కిరీటి ! క్షణంబు తాళుఁడో యీ ! యిది యుద్ధధర్మ"మని యీావువచించుచున్న, నిన్ను న న్యాయముగా వధించిన ధనంజయుఁడా విజయుండు ? నీవు కావా? యకటా ! యిదెక్కడి నిరర్థకధర్మమొ ! సూర్యనందనా ?

'కర్ణునితల భారత' మని
దుర్ణయవాక్యముగఁ బల్కుదురు జను, లో శౌర్యార్ణవ ! నీ చరితము సం
పూర్ణముగ నెఱుంగ లేక పోవుటవలనన్.

# ౪. శిశు ప్రబోధము

పురిటింటన్ జరణంబు మెట్టి, భువనంబున్ జూచి, కంఠంబు బొం
గురువోవం బలవింతు వేమిటికి? నీకు న్నాకలోకంబు క్ర
మ్మఱ రాదోయి దిగంబరీ! యిచటి కామక్రోధలోభాలకున్
గుఱియైపోవక తప్ప, దూరడిలి బంధువ్రాతమున్ దన్పుమా!

ఊరుంబేరును లేక యే గగనమందో లీనమై యున్న యా
త్మారామము న్నిను రక్తమాంసఘట మధ్యంబందు బంధించి, ని
స్సారం బైన మనుష్యమండలనివాసప్రాప్తి శాసించినాఁ
డేరాజో! యతఁడే సమర్థుఁడగు నోయీ! ముక్తి నీ కీయగన్.

ఏడువ కన్న! నిన్నువలె నేడిచినా రొకమాఱు భూపతుల్
గూడ, మహీతలం బనెడుకుంపటిలోఁ బడినాఁడ వప్పుడే
మూడునిమేషముల్ గడచె, ముందిఁక నికుదయించి, యెందఱే
ల్లేడుతురో గ్రహింపు మిది సృష్టిరహస్యము స్తనంధయా!

చవిఁగొనినావు నీజననిచన్నుల ప్రప్రథమైకదుగ్ధబిం
దువుఁ బెనుమాయలోఁ బడి కనుంగవ మూసితివూఱడిల్లి మా
నవత ఘటిల్లె, నిచ్చటి క్షణక్షణ కష్టసుఖంబు లల్లనన్
గవిసెడ్వాదాయువున్నఱకు కాలము నందివియుత్తమాంశముల్

పరమం బగు వత్సలతా
శరనిధి యనఁజాలు తల్లిసముఖంబున నీ
మరణమువఱకుం దఱచగు
పరలోకసుఖం బొకింత ప్రతిబింబించున్. ౫

## 9. అఖండగౌతమి

శబ్దశాసనుని ద్రాక్షాకషిత్వమును గా
మించి, యెన్నాళ్ళు లాలించినావొ ?
విష్ణువర్ధనమహీశభుని శాసనమును
దలఁదాల్చి, యేరీతి మెలఁగినావొ ?
రడ్డిరాట్సుతుల పారాణివన్నెలు దేలు
నలలతో నెబ్బంగిఁ గులికినావొ ?
చాళుక్యనృపతుల సంగరశ్రమ వోవఁ
గలువపుప్పొడి యెంత చిలికినావొ ?

భద్రగిరి రామ పాదుకాస్పర్శనంబు
గణన కెక్కిన కోటిలింగాల పూజ
కలిగి పయనించు హంసికాగమన వీవు
గౌతమీగంగ ! రమ్మ స్వాగతము గొమ్మ ! ౧

త్ర్యంబకగ్రామానఁ బ్రభవంబుఁ గన్నావు
అడవులలోనఁ దోఁగాడినావు
ఉపనదీజలముల నొడలు పెంచినావు
కొండలఁ బింపిళ్ళు గూసినావు
కలువకన్నుల సోయగంబుఁ దాలిచినావు
తేటికాటుకరేఖ దిద్దినావు
ముత్యాలసరులు ఱొమ్మున నిల్పుకొన్నావు
గంభీరహృదయంబు గాంచినావు

వేఁగిరాజ్యానఁ బంచమవేద మైన
భారతగ్రంథమందుఁ బర్వత్రయంబు
చదువుకొన్నావు శబ్దశాసనుని యింటఁ
బతికి వినిపించి మన్నన వడయు చుమ్మ! ౨

నలినీగంధము దోఁగువీచికల స్నానంబాడు సంధ్యాసురు
త్తులు క్రీడించెడు నీ విశాలపులినస్తోమంబునన్ బత్రముల్,
గలముంబూని, చరించు నాంధ్రకవిలోక గ్రామణిన్, దమ్మిపూ
వుల నెన్నాళులు పూజచేసికొనినావో! పుణ్యగోదావరీ? ౩

పదిరెండేడుల చిన్నదానవయి, యంభశ్శీఘ్రయానంబుతో
నుదధింగూడఁగఁబోవునీహొయలు, నీయొయ్యారమున్ రేవియు
న్గదురుం జూపి, సమస్తతైర్థికుల కో గోదావరీదేవి! స
మ్మదముంగూర్చెడుపుష్కరంబులను బ్రహ్మాండంబుగొండాడెడిన్.

పుట్టి గతించిపోయెడు నృపుల్ ధరణీవిభవంబుఁ గోరి, నీ
గట్టున నుగ్రసంగరముఖంబున నెందఱు క్రుంకినారొ! నీ
పొట్టకు వారియస్థికలు పోడఁ బయ్యెఁ గదమ్మ! చావు లే
నట్టి, సుధాశరీరమహిమాన్వితా! వందన మమ్మ! గౌతమీ! ౫

## 10. పంచముఁడు

కలకలలాడు చక్కనిముఖంబునఁ గాఱు మొయిళ్లు గ్రమ్మఁ జె
క్కుల దిగజాఱు బాష్పములు కుంభినిఁ బుణ్యనదీనదంబులై,
జలధులు గట్టిచుట్టుకొన సర్వదిశ ల్వరికించుచున్న పి
ల్లలు గలదాన! భారతవిలాసిని! యూఱటఁ జెందు మంబికా!

అస్పృశ్యతాజాడ్య మాత్మనాశనమార్గ
మనుమాట కన్వయం బయ్యెఁగాని
యీశ్వరసృష్టిలో హీనుండు ఘనుఁడు లేఁ
డనుసూక్తి సమ్మత మయ్యెఁగాని
ఐకమత్యము లేమి నసు పరాధీనత
యద్దానఁ జూచిన ట్లయ్యెఁగాని
మన మహాత్ములవారిఁ దనియింప విధి లేక
నటనఁ జూపించుచున్నారుగాని

అన్యదేశాలు పరిహాస మాడినపుడు
ఆత్మ గుందుట పరిపాటి యయ్యెఁగాని
హరిజనుల నుద్ధరించు ప్రయత్నమందు
వెనుక ముం దాడుచున్నవి పెద్దతలలు.

పూవులుఁ బండులుం బసుపుఁ బూఁతలు కానుకలంది, ధర్మపుం
ద్రోవ లెఱింగి, యర్చకులతో వచియింపక మిన్నకుండి రీ
దేవత లాదిమాంధ్రులకు దేవతలుం బగవారలైనఁ ద
ల్లీ! వసుధాస్థలిం బ్రదుకు లెట్టుల పీడితుఁ డెల్లనాఁటికిన్? 3

ముసలివాఁడైన బ్రహ్మకుఁ బుట్టినారు
నలువురు కుమారు లనుట విన్నాముగాని
పసరమునకన్న హీనుఁ డభాగ్యుఁ డైన
మైదవకులస్థుఁ డెవ్వ రమ్మా! సవిత్రి! ౪

వేదచతుష్టయంబు ప్రభవించిన వ్యాసునిదివ్యవాణిలో .
మాదిగలుండురా? రుధిరమాంసములుం గల యంటరానివా

రాదిమవాసు లక్కటకటా ! తలపోసిన నల్లగుండెలో
సూదులు మోసులెత్తును గృశోదరి! యెట్లుసహించుకొందువో!

## 11. మాతృప్రేమ

మాతల్లి కడుపులో మసలు ప్రేముడి చింది
జలధులై యిలమీఁద నిలుచు నేమొ
మాయమ్మ, నామీఁదమలపు చల్లనిచూపు
మంచు వెన్నెలఁ బుక్కిలించు నేమొ
మాయంబనోటికమ్మనిమాట తేనెయే
కలశవారాశిలో మొలిచె నేమొ
మామాతకౌఁగింటి సుఖముఁగునఁ గలహాయి
స్వర్గీయధృతి కనుప్రాస మేమొ

చేరి తనమేని నెత్తూరుటేరులందు
నేను నిలుపీత లేఁపని నెలవు లేదు
జననదినమునఁ బురిటిమంచాలమీఁద
నేను దనగుండెకాయనై నిలిచినాను ౧

నాతల నొచ్చినన్ దనమనంబున మిన్నులు గ్రుంకిపోవ, శో
కాతురయై, యెదుర్కొను మదంబ మొగంబునఁ బ్రాణవాయువుల్
పాతరలాడుచుండు, బహుభంగుల, నాకొఱకై శరీరమున్
గోఁతకు నప్పగింపఁగలుగున్ భగవంతుఁడు ప్రశ్న సేసినన్. ౨

అఱువదియేండ్లు నాదగుశిరోగ్రము నెక్కినఁ దల్లికంటికిన్
జిఱుతనుగాక పో విది, విచిత్రము, నే నిలు దాఁటిపోయినన్
మఱలినదాఁక నా వెనుక మాయనుజీవము మూఁడుగాళ్ళతోఁ
దిరుగుచునుండు, నీఋణము దీఱదు రక్తము ధారవోసినన్.

తల్లిగర్భానఁ బొడమువాత్సల్యజలధి
పుట్టుమొదలుగ నామీఁదఁ బొరలుచుండు
మానవాకారమునఁ జెప్పలేను గాని
దానిపరిమితిఁ గొలుచుకొన్నాను నేను. ౪

పొదుఁగుగిన్నెను బాలు వోసి దూడకు నిచ్చి
యఱ్ఱు నాకెడు పాఁడియావుచెంత
బొండంపుఁదిత్తులు నిండఁ దెచ్చినమేఁత
బిడ్డకుఁ దినిపించు పిట్టచెంత
పాలిండ్లపట్టు దప్పనిపిల్లతోఁగూడఁ
గొమ్మకొమ్మకు దాఁటు కోఁతిచెంత
తాంబూలరాగదంతముల నవ్వులసంత
తుల మోయు దానిమ్మ మొలఁతచెంత

చలువకన్నీట నాదుమస్తకము నంటి
వృద్ధజనయిత్రి యభిషేక మిచ్చుచుండు
వడకుఁదన మేలు తన కరాబ్జములనీడ
బ్రతికెదనుగాక నూఱేండ్లవఱకు నేను. ౫

## 12. అర్ధరాత్రము

ప్రళయకాలాంబుదంబు లంబరము నేలి
యుఱుముచున్నవి భువన మల్లూత లూఁగ
గుసగుసలు వోవుచున్నది కువలయంబు
కలదుగాఁబోలు నెత్తుటిగాలివాన. ౧

మంచిరోజులెందు మాయమైపోయెనో
కలహభేరి మ్రోసెఁ గంఠమెత్తి
కలవరించురాజ్యములహడావిడిఁ జూచి
మృత్యుదేవి వీణ మీటుకొనియె. ౨

నేఁడో! రేపో! రక్తపుఁ
గూడుఁ గుడిచి, యేమిపాడుకొనునో! భాషా
ప్రీడావలి, యేదేశము
పాకువడునో! యెంత కీడు వాటిల్లెడినో! ౩

పోటమరించినపోరాటములనెపమునఁ
బ్రసవవేదనపడు ధరావలయమునకు
జననమందునో! లేదో! ప్రశాంతిశిశువు
మలయునో! లేదో! యానందమారుతంబు. ౪

ఈకలహాసవోన్మద మహీవలయంబు, పిశాచయోగ్యమై
చీఁకటికోనయై, యశుభచిహ్నితమైన నిశీథమందు, న
య్యో! కనుమూసి తూలిపడియున్నది, ముక్తకరాళఖడ్గమై
యేకడ డాఁచెనో! తెలియ దిద్ధపరాక్రమగర్వబీజముల్ ౫

కలకలలాడుసంపదల కౌఁగిట నూయలలూఁగుధారణీ
శులు శయనించినారు రణశూరుల కత్తుల కాపలాలలో
బలసిన గుడ్లగూబల రవంబున నీ నడురేయి యే యమం
గళములు పల్కెనో! పసిఁడికంటులు నవ్వెఁ గికాకికధ్వనిన్.

## 13. బుద్ధుఁడు

నవనవోల్లసిత కాననశోభలకుఁదక్కి-
పండుటాకునఁ జిందుబాష్పజలము
మొలకమీసాల కోమలసంపదలు రోసి
ముసలయ్యకొఱకు వాపోవుకరుణ
తళుకుటద్దాలమేడలపోఁడిమిందాఁచి,
పాడుగోడలకు నల్లాడుదృష్టి
చెలువారు పండువెన్నెల సిగ్గులకుఁ బాసి
కటికిచీఁకటికి దుఃఖపడుప్రేమ

లంబినీవనభూము లాలంబనముగ
బుద్ధనామంబుఁ దాల్చి యుద్భూతమంది
నవ్యతరధర్మసంస్థాపనం బొనర్చి
దిక్తటంబుల వెలసి యదృశ్యమయ్యె. ౧

మాతృగర్భము నందె, భూతకోటిం గాంచి
జాలితో నభయమొసంగినావు
గాయంబు గల యంచరాయనిం గొని పెంచి
కన్నీట దాహంబు గడపినావు

నడలేక మడిదున్ను బడుగుటెద్దును జూచి
నెనరుఁజూపుల మేను నిమిరినావు
తనువుఁ జాలించి పోయినజీవి నీక్షించి
నడుము నక్కున వ్రీలి నలిగినావు

ప్రాజ్యసామ్రాజ్యదివ్యవైభవమునందు
నమ్మకము దప్పి బోధివృక్షమ్ము నీడ
గుండెదిగులెల్ల నీముందు కుప్పవోసి
ప్రజ్వరిల్లితె శాంతిదీపంబ వగుచు. ౭

నిదురంబోయెడు మించుతీవె యగు నీ నేస్తంపుటిల్లాలిక్రొం
బొదిగింటం గనుమూసి పాల్గుడుచునీపుత్రుం బరీక్షించి, మే
నెదుగ న్ముద్దిడఁబోయి, నిల్చితివిగాదే? నీదువైరాగ్యసం
పదకు న్గంపము నందుచున్న యది దేవా! మేను, బుద్ధాగ్రణీ!

అరమైలు నిను సాగనంపి నీ సెలవు గై
కొని రాదె? నీయింటిగోపురంబు
శాటుకతో దీనగతి మ్రొక్క లిడలేదె?
తెలివి దప్పెడు నింటిదీపకళిక
ముంగాల ధరణిఁ జిమ్ముచుఁ గంటఁదడిఁబెట్ట
దా? నీదు పంచకళ్యాణి హయము
వజ్రకాంతులఁ దెల్ల వాటిశోకింపదా?
భాసిల్లు నీదు సింహాసనంబు.

అంధకారంబు నీకు సాయముగ నడువఁ
జుక్క మొత్తము లోలోన స్రుక్కుచుండ

నూరులేని ప్రయాణంబు గోరి నీవు
నాటినడురేయి నీయిల్లు దాఁటినపుడు

నీయింటియాటకన్నెలు పన్నకము సేయు
వాల్చూపుటుచ్చులఁ బట్టువడక
నీమనోహరమణీనిలయము ల్పుట్టించు
మోహాంబునిధిలోన మునుక లిడక
నీఖడ్గనిచయంబు నిత్య ముద్రేకించు
చేతులదీఁటకుఁ జిక్కువడక
నీలేమచంకగారాలపట్టి రచించు
కడుపుఁజిచ్చునకు ఖంగారుపడక

స్వర్గనిర్గత మగుదివ్యవాణిపిలుపు
కర్ణములు సోక నుత్తరక్షణమునందు
సకలవిజ్ఞానమున రాచటికము సేయఁ
బరువులెత్తవె ? బుద్ధభూపాలచంద్ర ! ౫

కుంటిగొఱ్ఱెను మోసికొనివచ్చు నినుఁ జూచి
గొల్ల లేమని మ్రొక్కుకొన్నవారొ !
కన్నీటి నీప్రసంగము నాలకించిన
బింబిసారుం డెంత బెగ్గడిలెనొ !
ఆఁకట న్నలిఁగి నీఁ వవనిఁగూలిననాఁడు
ఖగసమూహం బెంత బెగడుగొనెనొ !
బావురు మను నీదు పసిఁడిగద్దెం జూచి
జననీజనకు లెంత వనరినారొ !

శాంతిమకరంద మొలుకు నాస్యంబు నరసి
సన్నిహితభూమిఁ గారాడుజంతుకోటి
యెట్టిపున్నియమును మూటగట్టుకొనెనొ
పూజితక్షమావిభ్రాజ! బుద్ధరాజ! ౬

---

## 14. సందేహడోల

పుణ్యపాపంబు లని జగంబులు నుతించు-
నేది? పుణ్యము, పాప మెయ్యది? మహాత్మ!
రెంటికి ఫలంబు లిడి సమర్థింతువంట
తెలియఁజేయుము, నన్ను గద్దించుకొనుము. ౧

సృష్టికర్తవు నీవు నీసృష్టిలోని
మానవుండ నే, నిద్దఱిమధ్య మనకు
ముసుఁగులో గ్రుద్దులాటలు పొసఁగ వింక
హక్కు గలదయ్య! ప్రశ్నసేయంగ నిన్ను. ౨

మోహనపదార్థములు కుప్పవోసియున్న
క్ష్మాతలం బను కైతవమందిరమున
నన్నుఁ బుట్టించినావు, మానవుఁడ నగుట
ననుభవించితి నందు కేమందు వీవు? ౩

కరుణ నీలోన జన్మంబు గాంచు నంట
నీవె కరుణకుఁ గడలేని నిలయ మంట
జీవి నొకజీవి కన్నంబుఁ జేసినావు
నాథ! యిది చూచి నాగుండె నలిఁగిపోవు. ౪

పక్షపాతంబు లేదు దైవమున కండ్రు
ఖలుఁడు సుఖియించు, గుణశాలి కష్టపడును
కడకు నిదఱిదెస నొక్కకంట నరయు
మృత్యుదేవత నేల నిర్మించినావు? ౫

సిలుఁగు లన్నియు ననుఁ బరీక్షించుకొఱకు
నీవు సృష్టింతువఁట యిది నిక్కమయిన
జీవితం బెల్ల నే నిట్లు చివుకుచున్న
సర్వలోకేశ! యేది విశ్రాంతి నాకు? ౬

ఎఱుఁగ జేయక నను సృజియించినావు
తగవు దప్పిన దండింపఁదలతు వంట
'వట్టి దిది' యన్న ననుఁ 'బిచ్చివాఁడ' వందు
రందుకే నాకు సంశయం బంకురించు. ౭

స్వర్గనరకంబు లున్న వచ్చుటికి నరులఁ
బుణ్యపాపంబులే కొంచుఁ బోవు నండ్రు
పల్కుదురు గాని కనివచ్చువాఁడు లేఁడు
ఈ రహస్యంబు రూపింప వేల? నాథ? ౮

జగతి పుట్టిన దాదిగాఁ జచ్చియున్న
భక్తు లెందఱు భూమిగర్భమున లేరు?
వారిగతి యేమి? వా రెల్ల స్వర్గసీమ
నుందురా! యానతీయ వేమోయి నాథ! ౯.

## 16. కృష్ణదేవరాయలు

ఆంధ్రుల భావనాట్యస్థానముల లోన
నాడు నీ కావ్యకన్యకల సరసి
యనిఁ గన్నమూయ కింకనుఁ దోఁచు నీ సమి
త్కఠాణాఖురళికాంకములఁ జూచి
కలితశౌర్యజ్వాలఁ గరఁగించి పోసిన
జయశాసనస్థిరాక్షరము లెంచి
పెద్దనార్యునిచిత్రవీథి కందక దాఁటి
దిశలఁ దాండవమాడు తేజ మెంచి

చిరము నీరాజ్యలక్ష్మి వర్షించుబాష్ప
పూర మదె! తుంగభద్రాఖ్యఁ బూని పాఱు
చుండు నిప్పుడు బళ్ళారిమండలమున
నాంధ్రకవిచంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!

మహితాంధ్రభోజనామకరత్నము వహించి
క్రాలు విశాలవక్షస్థలంబు
పరభీకరప్రభావమ్ము బయ ల్చిమ్ము
సరిలేని కోరమీసములజంట
చతురబ్ధివలయితక్ష్మాభారమునకుఁ బెం
పున నిక్కి కనుచుండు భుజయుగంబు
దురమున నిప్పులు గురిసి, దీనులయందు
దయను గుంభించు నేత్రద్వయంబు

అష్టదిగ్గజవాగమృతార్ద్ర మగుచుఁ
బావనం బైన నీ సభాభవన విభవ

మర్కటా! జీర్ణనగరకుడ్యాంతరములఁ
బండి నిద్రించెనే? కృష్ణపార్థివేంద్ర!

భాషాసముద్రకుంభప్రభవుఁడ వయ్యు
విద్వత్కవుల గారవించినావు
ప్రతిపక్షరాజభార్గవరాముఁడవ యయ్యు
వెన్నిచ్చుచో విడిపించినావు
వైరిరాణ్మకుటశుంభత్పదాబ్జుఁడ వయ్యు
బెద్దన్నపదము సేవించినావు
అర్థార్థిజనకల్పకానోకహమ వయ్యు
సత్కృతులకుఁ జేయిసాఁచినావు

ఔర! శ్రీకృష్ణరాయ! నీయంతవాని
దివికి నర్పించుకొన్న మాదేశజనుల
భాగ్యహీనత నొక్కి చెప్పంగలేక
చిలువరాయఁడు వేయినాల్కలు వహించె.

కవివరేణ్యులు నీకుఁగా సృష్టిఁ గావించు
కృతికన్యకలను దుఃఖితలఁ జేసి
నావాడపతిశకంధరుఁ డాదినృపు లంపు
కానుకబండ్లు వెన్కకు మఱల్చి
ముదురువెన్నెలఁ గాయు ముత్యాలగద్దియఁ
బరరాజధూర్తులపాలు చేసి
నిరతంబుఁ బగఱనెత్తురుటేఱుల మునుంగు
కత్తి కాఁకటిచిచ్చుఁ గలుగఁ జేసి

కుడియెడమలను నీతోడఁ గూడి తిరుగు
సుకవికులకోకిలంబుల శోకజలధి
ముంచి, యల బృహస్పతివ్రాఁత మంచి దగుట
దివికిఁ బోయితె? శ్రీకృష్ణదేవరాయ? ౮

ఆయతవర్ణనావిభవ మచ్చుపడం బనిపూని విష్ణుచి
త్తీయము వ్రాసినావు కవిధీరులగుండెలు తల్లడిల్ల, నేఁ
డీ, యొకఁడేని మీసముపయిం జెయివైచి, రచించు సత్కవి
ధ్యేయుఁడు? క్లిష్టకావ్య మన కేమి యశక్తులు? కృష్ణభూపతీ!

ఆశీర్వదించినారా, వ్యాసవాల్మీకి
బృందారకమునీంద్రు లెదురువచ్చి?
కన్నావె, కవిభయంకరుఁ గాళిదాసు? భో
జుం డున్నవాఁడె విశ్రుతగుణుండు?
రంభ నీతోడఁ గేరడ మాడునే? దానఁ
గోపించునే నలకూబరుండు?
జలభేది వేయిగన్నులఁ జూచి నిను గౌర
వించుచున్నాఁడె కోవిదులలోన?

తిరుగ నీ నెయ్యపుంగవీశ్వరులగోష్ఠి
జరుగుచున్నదె దేవేంద్రపురమునందు?
నెచట నుండిన నేమి, శ్రీకృష్ణరాయ!
భరతపుత్రుల నొకకంట నరయుమయ్య! ౯

# 16. సంసారసాగరము

రాఘవుని మేలివింటి నారాచమునకుఁ
దనివిదీఱనికుంభజు దాహమునకుఁ
జిక్క కేరితి దాఁటివచ్చితివా! నీవు
సంకటకదంబ! సంసారసాగరంబ! ౧

త్రవ్వఁబడ లేదు సగరనందనుల చేత,
సంగమింపదు వాహినీసముదయంబు
ఏవిధి, గభీరతఁ దాల్చినావో! నీవు
సంకటకదంబ! సంసారసాగరంబ! ౨

రంగదుత్తుంగభంగతిమింగిలాకు
లం బయిన వార్ధి దాటఁగలాఁడు నరుఁడు
నిన్నుఁ దరియింపఁజాలఁడు నిక్కవంబు
సంకటకదంబ! సంసారసాగరంబ! 3

నీయుదంతం బెఱింగి, గాంగేయుఁ డొకఁడె
మునిఁగి తేలఁడు నీయందు, మునిఁగి నీదు
వనటఁ గుందక వచ్చె నొడ్డున కెవండు?
సంకటకదంబ! సంసారసాగరంబ! ౪

శమదమాది ప్రవిమలగుణములు గలిగి
తపముఁ గావించుగాధినందనునిఁ దొల్లి
మేనకామిషంబున నాక్రమించుకోనవె?
సంకటకదంబ! సంసారసాగరంబ! ౫.

ఈశ్వర ధ్యానదివ్యదమృతముఁ గ్రోల
నభిలషించుకుటుంబిహృదంబకంబు
తెరువు మూయునఛేద్యభిత్తికవు నిజము
సంకటకదంబ! సంసారసాగరంబ! ౬

సాంద్రనీలాంబుధరపరిచ్ఛన్నమైన
కృష్ణపక్షనిశీథమం దేని దిక్కు-
దోఁచెడిం గాని, నీయందుఁ దోఁచ దకట!
సంకటకదంబ! సంసారసాగరంబ. ౭

భూమిభారంబు మాన్ప నుద్భూతుఁ డయిన
రామునంతటివాఁడె నీప్రళయగర్జ
కాఁగఁజాలక తల్లకిందు లయ్యెఁగాదొ?
సంకటకదంబ! సంసారసాగరంబ! ౮

ఉదధి! యొకసారి యుప్పొంగు, నొక్క-సారి
నిమ్మళించును గాని శాంతింప వీవు
గగన మంటుచుఁ గష్టభంగములతోడ
సంకటకదంబ! సంసారసాగరంబ! ౯

## 17. లోకబాంధవుఁడు

అది, యనేహఃప్రవాహవీచ్యంతరమున
నశుభదేవత జీవుల నాహరింపఁ
బ్రకృతినిం డాఁగి, యాస్యగహ్వరము విచ్చి
తాండవించెడు మట్టమధ్యాహ్నవేళ. ౧

అది, భయంకర మృత్యుదంష్ట్రాంతరాళ
జనితవిషవహ్ని మెఱసిపోయినప్రదేశ,
మది, విషాద నీరదపూరితాంబరమునఁ
బ్రభవమందిన పిడుగులు వడినతావు ౨

మృగతృష్ణల్ పొగదుమ్ములో మెఱసి భూమీమండలిన్ జుట్టిపై
కెగసెన్, నాల్కలు ముద్దగట్టుకొని పోయెన్, జీవు లల్లాడె, వి
ష్వగరేఁగెన్ వ్యాకులాకుతోడ సుడిగాడ్పుం దయ్యము, బ్రొద్దుకు
న్బాగ రక్తంబది రెండు గొట్టెనపు డెండున్ గంట లుత్కంఠతన్.

గుబురుకొని యున్న తింత్రిణీకుజములందు
నాకుగొడుగులనీడల నధివసించి
పులుఁగుఁబదుచులు గుసగుసల్ వోవుచుండె,
మెలఁగు సుడిగాడ్పుటురవడి కులికిపడుచు. ౩

సవితృమండలకిరణఘర్షణమువలనఁ
బ్రత్తికాయలు చిటపటఁ బగులుచుండె
'రింగు'మని మింటి కెగసి యేట్రింతపిట్ట
ఈలవేయుచు నొగి పల్లటీలు గొట్టె. ౪

గాలి దినుసుకుక్కరబ్బరుకత్తలాని
నెక్కి, శరవేగమున వీటి కేగువేడ్కఁ
బయన మొనరించుచునను తెప్పపాటులోనఁ
దాఁకెఁ మఱపించి దుష్ప్రవాదముపిశాచి. ౫

రబ్బరుబండికొమ్ములు కరఁబుల జాఱెను, దృష్టి కడ్డమై
మబ్బులు గ్రమ్మె, మీఁదటి ప్రమాద మెఱుంగను గాని, లేచి నా

జబ్బను, సప్తలోకములు సాగరము ల్మెఱుము ల్విషధ్వనుల్
గుబ్బటిలన్ గ్రహించితి, దిగుల్పడి, దయ్యము లీనుతావునన్.

యోచనాశూన్యమై, బాధయో భయంబొ
యనుభవించెడు నాహృదయమునఁ దాఁకె
'నయ్యయో !' యను కరుణ కిత్తైనపలుకు
కుటిలతీక్ష్ణాతపముఁ జీల్చుకొనుచు వచ్చి ౮

అది యొక దేవదూతపలుకా యని, కొంచెము నిబ్బరించి, కన్ను దెఱచి, చూచి గాఁడ నొకనూతనపాంథు, నిఁకేమి సెప్ప, నా సదయుఁడు ఒమ్ముగొట్టుకొనసాఁగెఁ, బదింబడి మాటలేల ? నా కొదవినకష్ట మచ్చువడి యున్నది, వాని ముఖాంబుజంబునన్.

కిరణములతోడ ననుఁ గంటగించి చూచు
తరణి కెవఁ డిచ్చె లోకబాంధవసమాఖ్య ?
పరులబాధలు గని గుండె గరఁగి వగచు
పాంథ ! నీవయ్య ! త్రైలోక్య బాంధవుఁడవు. ౧౦

## 18 అనసూయ

విజయవిలాసుని వినుతింపఁ దలఁచిన
జక్కన్న కోరమీసాలు దువ్వె
జక్కన్నకవనంబు చక్కని దని పల్కఁ
బినవీరకవి నాల్క వెళ్ళఁబెట్టెఁ
బినవీరకవి పల్కు వెలఁదికి మగఁ డన్న
గండపెండారంబు ఘల్లు మనియె

బెద్దన్న కవితకుఁ బెరతాత యని పల్క-
రామభూషణుఁ డంబరంబు సూచె

భట్టుమూర్తికిఁ గవిరాజపట్ట మీయఁ
దిట్టి లింగఁడు చేపలబుట్ట సూపె,
నందఱుందఱు మహాసీయు లని తలంచి
యొక నమస్కార మొనరించి యూరకుంటి. ౧

నన్నయ తిక్కనాది కవినాథుల పంచమవేద మంతలోఁ
బిన్నవినవ్వు దోఁప నగుపించి, "మహాత్ముల విస్మరింతురే?
పెన్నలు, మంచి"దంచు నుడివెన్, దలవాల్చితి, నంత "వారి దే
మున్నది మమ్ము జూడు" మనుచుండిరి, భోజసభాకవిప్రభుల్.

పదలాలిత్య మెసంగ దండి వచియింపం జొచ్చె. "నర్థంపు సం
పద కావ్యేందిర కంగపుష్టిఁ గలిగింపం జాలు" నంచున్ సభా
సదులందుండి వచించె భారవి, స్వహస్తన్యస్త కాదంబరీ
మద మేపారఁగ "భుక్తశేష" మనిసంభాషించె బాణాఖ్యుఁడున్.

ఉపమానంబులనిగ్గు దోఁప, బహుకావ్యోత్పత్తిఁ గావించి, వా
రిధిపరీతాఖిలధారణీతలనుతశ్రీ నందకొన్నట్టి నే
రుపరిన్ గాంచితిఁ గాళిదాసకవివర్యున్ జెంత నక్కాళికా
చపలాక్షిన్, జపలాపమంచితవపుస్సౌందర్యలీలావతిన్. ౨

"అలకాపట్టణమార్గమధ్యమున మేఘాకారతం జొచ్చి, నీ
పలు కస్మన్నద్రదభంజనంబు నొనరింపన్ సాఁగె దిఙ్నాగుఁడన్
విలసత్కావ్యకళాపశారద! కృపాభిప్రార్థి" నం చొక్కఁ డం
జలి యొగ్గెన్ జని, కాళిదాసకవి కీషత్కంఠగాద్గద్యతన్. ౩

"పరిపూర్ణప్రతిభావిభాసి యగు విద్వాంసుం డసూయామతిన్
బరికింపండు పరాయికబ్బములు దిఙ్నాగాభిధానా! హరి
ద్వారదంతిప్రతిమానపండితమహేంద్రా! నీకుమారసృష్టి, సం
స్మరణీయం" బని మ్రొక్కె, భూమిపతి మెచ్చ, న్గాళిదాసాఖ్యుఁడున్

ఆపలుకు లచటిగర్వో
ద్దీపితు లగు కవులమది గుదించె, నసూయా
తాపములు దీఱెఁ, గాళీ
భూపతుల మొగాన నమరె ముసిముసినగవుల్. ౭

## 19. తబిసివస్తాదు

అవి మహాయోగి వేమన కవివరుండు
జీవయాత్రను వెళ్ళఁబుచ్చిన దినాలు
అవి యతనిగోరువెచ్చని యమృతవాణి
తెనుఁగుఁబొలమున స్వారిచేసిన గడియలు. ౧

పెడకంటి రెడ్డపెంపుడు
కొడుకయి, నివసించు నొక్కగోనా, జావుం
బడఁతుకల వలపుల యచం
గుఁడు నయి, రేనాట నొక్క కుగ్రామమునన్. ౨

పిడికెడుకొమ్ముతో, నడుగువేసిన గుల్కెడు కండపుష్టితోఁ,
బుడమిని జీరువాఱు జిగి ముద్దుల కుచ్చుల గంగడోలుతో,
నెడమ బుజాన నించుక శయించిన పట్టెడుచెండుతో, కడుం
గడు బెడఁగైనవద్దె, శివునినందినిఁ గొండలపాలు సేసెడిన్. ౩

దాని, వెడఁదవెన్నుపై నాల్గుతూముల
ముత్తియముల నాఁటఁబోయవచ్చు
దానికాటుక కనుఁదమ్ముల నిడువాలు
చూపు, గర్వమునకుఁ గాఁపురంబు. ౪

దానిఱంకె విన్న ధేనుసంఘంబులు
మేఁత మాని బెదరి మిన్నుసూచు
జీవితేశ్వరుండు శీలంబులను సంశ
యించె ననుచు సంశయించుకరణి ౫

చూఁడియాలు దానిసుందరాకృతిఁ జూచి
దినదినంబు మురిసికొనుటకతన
నదను దప్పకుండ నదయించు నాయెద్దు
నీడ లయిన కోడెదూడగములు. ౬

కన్ను లరమోడ్చి, వీధిశృంగాటకమున
నెమరువేయుచు నాయెద్దు నిలిచియుండ,
దానిమోహనమూర్తి నద్దమునఁ బోలెఁ
జెక్కుచుందురు ఱాలపై శిల్పివరులు. ౭

పసిపిల్లనలెఁ బురంబున
మసలుచుఁ, బసిపిల్ల లడ్డుమసలినఁ, గొమ్ముల్
విసరక, బుసకొట్టక, య
బ్బసవన సాధించెఁ బ్రజలవాత్సల్యంబున్. ౮

కాలు నేల రాచి, గదిమి, ఱంకెలు వెట్టి,
మోర యెత్తి, వాలము న్నిగిడ్చి,

దానిమీఁద వైర మూని కొండొకయెద్దు
యుక్కు మిగిలి తాఁకె, నొక్కనాఁడు. ౯

త్రాగినవానికన్నులవిధంబున నేత్రము లెఱ్ఱవాఱ భూ
భాగము దద్దరిల్ల, వృషభంబు ఖణిల్లున అంకెవెట్టి, తూ
నీఁగ విధానఁ బోయిపడియెం బ్రతివీరునిమీఁద నంతలో
మూఁగిరి పౌరు లాసమరముం గనువేడుక జిఱ్ఱికొట్టుచున్.

పుచ్ఛాలపై విసమంతలు
పెచ్చు లెగయ గుండెయలు గుభిల్లుమ మనఁగా
నెచ్చిది, లొచ్చిది, యని వా
క్రుచ్చు నలవిగాక కుమ్ముకొనుచుఁ బెనంగెన్. ౧౧

తలలు పగిలి రక్తధారలు, మృత్యువు
చాఱ లగుచు నేల జాలువాఱ
నాలపోతుజంట యంత కంతకు రోష
మతిశయింపఁ బోరె నలపులేక. ౧౨

అదలించి కొట్టి, యింతియు
బెదరక, పిఱుతివక, పెనఁగువృషభములకుఁ ద
ప్పదు మరణ మనుచు నాసలు
వదలిరి, పురజనులు దిగులువడి కన్గొనుచున్. ౧౩

వంగపండువంటి పచ్చనిమైచాయ
యుంగరాలు దిగియున్న కురులు
బూదిపూఁత లేని పుట్టగోచుల లేఁత
యోగి, యొకఁడు వేగ నుఱికి వచ్చి. ౧౪

ఉఱు ముఱిమినట్లు, 'ఛీ' యని
యఱచి, సమీపించి, చఱచె నఱచేతులతోఁ
జిఱుప్రక్క లదర, నెద్దులు
పఱచెం గ్రొన్నురువు నోటఁబడ దిక్కులకున్. ౧౮

అతఁడు వేమన, భువనమాయాతమస్సు
జీల్చి, చెండినబలశాలి సిద్ధమూర్తి
సకలసామ్రాజ్యభోగపిశాచములను
గోఁచిపాఁతకు బలియిచ్చికొన్నఘనుఁడు. ౧౯

## 20. భూకంపము

కారుమేఘాలు నీమీఁదఁ గంటగించి
పిడుగుగాయాలు మేన, గావించుచున్న
నచలవై, ధైర్యవృత్తిఁ బాయవు గదమ్మ !
అవని ' నేఁ డేల గడగడలాడినావు ' ౧

వదలక నీయుగంబున నివాసము సేయు చరాచరంబు, నీ
యుదరమునందు డాఁగవలదో? తుద, కీ నడుమంతిరంపు టా
పద లొదవించి, నీకడుపు వ్రక్కలు సేయు ననంతశక్తి, యెం
దుదయమునంది, నీయెడఁద నూఁచెడినమ్మ ! క్షమాధిదేవతా !

ఇటలీలో నవలంబుఁ గ్రక్కె నొక భూభృన్మౌళి నీయానతిన్,
బుటభేదంబులు భస్మమైనవి, జపానుం బోయె నీమధ్య, ని
ప్పటి నీయాగ్రహ మిందియాదెస మఱల్పం గారణంబేమి? క్రాఁ
గిటిబిడ్డం గబళించుతల్లి గలదే? కిగ్గాడి, విశ్వంభరా ! ౩

ఉత్తమపట్టణంబు లయయో! నిముసంబున వల్లకాడులై
నెత్తురు గ్రక్కెఁ జూపఱులనేత్రయుగంబులు గోరగింప, భూ
భృత్తులు గ్రుంగి, తోయము లదృశ్యములైనవి విశ్వధాత్రి! నీ
తత్తఱపాటునన్ బ్రకృతితప్పె యొనర్చెను గారడీపనుల్. ౪

మతములు పోరాడఁగ నీ
కుతలపతులు పెనఁగులాడుకొని చావఁగ నో
రతనాలగర్భవతి! నీ
గతి తప్పవు జాలిపడవుగదవె, సవిత్రీ! ౫

ఇది పూజాసమయం, బిది
ఖుదానిలయ, మీతఁ డర్చకుం డనుచుఁ దలం
చెదవో, లేదో? కాశ్యపి!
కుదిలించితివేల? శివునిగుడిని, మసీదున్. ౬

## 21. కవితాలక్షణము

సందిటకు రాని వృద్ధభూషణము లెన్నొ!
తనువునఁ దగిల్చి, కావ్యసుందరిని దిద్ది,
బరువు మోయించి, తత్త్వంబు మఱచిపోవు
కవి యెఱుంగఁడు వ్యంగ్యవాగ్గర్భమహిమ.

పొదుగుబరువున నలనల్లఁ పదములిడుచుఁ
గదలి చనుదెంచుజన్నంపు మొదవునట్లు,
విపులరసభావభరితగంభీరగమన
మమరి చూపట్టవలయుఁ, గబ్బములకుదురు.

అసమానంబుగ ద్వ్యర్థికావ్యరచనావ్యాయామముంజేసి, స
ర్కసుడేరా బిగియించి, సూరకవి, యాకాశంబునన్ బల్లటీ
ల్బసికీల్గొట్టియుఁ గావ్యతత్వమును జూపంగోరి, గ్రంథాంతర
ప్రసవంబుల్ వెలయింపఁడే? నవరసప్రాధాన్యధీర్యోక్తులన్.

మదమరాళంబుల కుదురైన నడకలో
రాణించు సహజంబు రాజసంబు
కదను ద్రాక్షగుత్తాల గర్వంపుమెడల వం
పుల నుట్టిపడు కులుకులప పందు
వెలకూనలంటని నిండుజవ్వనికఁ చ
ద్వయి నేలు వలరాచవాని బిగువు
.కలికి గులాబి మొగ్గలమీఁది విశ్వమో
హనమైన సుస్నితమైన మెరుపు

మధుర రసమును గడుపున మాటుకొన్న
ద్రాక్షఫలగుళుచ్ఛములయందములతూఁగు
వరకవీంద్రుని కావ్యప్రపంచమందుఁ
బ్రతిపటంబున మదికి దర్శన మొసంగు 4

## 22. చీఁకటి

ఉచ్చనీచత్వములకుఁ జేయూఁత లొసఁగు
చంద్రసూర్యులతోడ మత్సరము నెఱపి
ప్రకృతిసౌందర్యమును గావుపట్టి మ్రింగి
సమత బోధించు నంధకారము రహించె. 1

మధురఫలముల గరువంపు మహిమతోడ
మిసమిసలు గుల్కు తియ్యమామిడివనాలు
ముదురుఁజీఁకటి కడుపున నొదిగిపోయి
తూలుచున్నవి, జడలదయ్యాలపగిది. ౨

మెఱపుఁదీఁగల చుఱుకైన నఱకుడులకుఁ
బాయ విచ్చినకౌఁగిటపట్టునుండి
గుట్టుగనుపింపఁ దనకొంప గూలినట్టు
లల్లుకొనిపోవు నెంత నియామకంబొ. ౩

చమురుబిఱ్ఱున వెలుగుఁదీపములకుతుక
నులిమి వేయుటకొఱకు నీడలవిధానఁ
బొంచియున్నవి చీఁకటిమొలక లకట!
సహజవైరంబు మాన్పునౌషధము గలదె? ౪

జీర్ణ దేవాలయముల వసించుకతనఁ
గటిక చీఁకటిలోని చక్కనిగుణంబు
నవగతము చేసికొన్న దివాంధ మొకటె
పగలు వల దని శ్లేషగాఁ బలుకసాగె. ౫

ప్రళయకాలాన సూర్యబింబము నశించుఁ
జిక్కుచీఁకటి రాజ్యంబుఁ జేయునపుడు
పతనమును గోరు పగలు శాశ్వతము గాదు
పెంపు నిలుచునె నడుమంతరంపుసిరికి? ౬

కన్ను పొడుచుకొన్నఁ గనరానిచీఁకటి
జలధిలోన సుప్రశాంతి గలదు

ఇనునివేయిచేతు లెఱుఁగని యొక వింత
ధర్మగుణము చల్లఁదనము గలదు ౭

---

## 23. ధ న్య జీ వి

క్రొవ్విన కాఱుదున్నవలెఁ గొమ్ములతోఁ బడగుమ్మచున్న పె
ద్దవ్వకు లేమిదేవతకు నంజలిఁ బట్టెదఁ దద్గళంబులో
గవ్వలపేరు నాగృహాముఖంబున వ్రేఁగినఁ జాలు గంజిలో
బువ్వకు మాధురీమహిమ పుట్టి, క్షుధాసుఖ మర్థమయ్యెడిన్.

ఆస్థకు నాస తోడుపడి యల్లరిసేయు నెడందతోడ, న
భ్యాస మొనర్చినాఁడను నభంబున మేడలు గట్టువృత్తి, యీ
రాసభయాన, యెండిన నరాలది, నన్ను వరించినంత, ని
ద్రాసుఖ మర్థమైనది, విదాహము దీఱె, నిఁకేమి కావలెన్ ?

తుకతుకలాడురక్తమున, నూఁకులు వెట్టెడి పౌరుషంబుతోఁ,
నొకనికిఁ దగ్గిపోవ వచు నుబ్బరమెల్ల నశించిపోయె, గుం
డెకు బరువైనతోంటి బురిడిపను లిప్పుడు లేవు, లేముల
మ్మకు దయరాకయుండినఁ, బ్రచుత్తతనేమియొనర్చియుండునో?

తిరిపెపుదమ్మిడీ తపివి దీపముగా వెలిఁగించి, దీపమే
యెఱుఁగని నాకుటీరమున నృత్య మొనర్చుమహాపిశాచి, చిం
పిరితలచిక్కులమ్మ, తరిబీయతుఁ జేసెడి నన్ను, భూమికిన్
బరువుగ, గబ్బిలాయిగ, తృణంబుగఁ, జుల్లనగా, హుళక్కిగా.

చెఱకుం బిండినలీల నాబలము నోడ్చెన్ గానుగంబట్టి, యా
పిరివో, దెమ్మ్మలప్రోవు సిల్చినది, నా వేషంబు నీక్షించి, నా
సరస న్నిల్చుట కేవగించుకొని జ్యేష్ఠాదేవి భీతిల్లు, నిం
కొరుఁ డేలాగున నిబ్బరించు నిపుడో హా! వింతధన్యాత్ముఁడన్.

కలికమునకు నేను గావలె ననువాఁడు
నెఱిఁగియున్నవాఁడు ధరణి లేఁడు
ఈ యనంతసౌఖ్య మేరాజు చవిఁ జూచు
నేఁడు నామనంబు నిశ్చలంబు. ౯

## 21 చనవు

వ్యాసమునీ! భారతమును
వ్రాసిన కవినాథ! పాండురాజసుతులలో
దోసము లేదా ? యేదీ
నాసంశయములు నివారణము సేయఁగదే ? ౧

ఏ కాలంబున జన్మమెత్తితివో, నీయిష్టంబె చట్టంబుగా
నూకొట్టించితి వెల్లలోకములు నిన్నూహింప, సత్కీర్తిచే
నీకున్ గడ్డము తెల్లవాఱువఱ, కా నీతోంటిమర్యాద, చిం
తాకంతైన నశింపలే దిపుడు తాతా! నానమస్కారముల్. ౨

మనలో మాటకుఁ జెప్పుకొందము, తలంపన్ ధర్మరాజేమి స
జ్జనుఁడో చెప్పుము? తాతపాదములపజ్జన్ జేరి, యుబ్బించి, యా
తని సంహార రహస్యముల్ తెలియ లేదా? యర్ధరాత్రాన, నె
వ్వని కేరిన్ వివరింపు, మిట్టికుటిలవ్యాపారముల్ మెత్తురే? ౩

పసివాఁ డేటికిఁ దమ్మిమొగ్గరముఁ జీల్పంబూనియే తెంచె; బా
లసుతై, కౌరవులెల్లఁ జంపిరని వేళాకోళమున్ జేతు ర
ప్పసివాఁ డెల్లర ముద్దుఁబెట్టుకొని పోవంగోరెనా? యేటి కీ
రసహీనం బగుధర్మనిర్ణయము, పారాశర్య? వాక్ప్రవ్వామా! ౪

గురుఁ డస్త్రంబులుపాఱవైచునని, యేన్గున్ ద్రోణిగాఁబోల్చి 'కుం
జర' మన్నందుకు ధర్మరాజును మహీచక్రంబు నిందించెడిన్
నరుఁ డంతన్ నఱకె న్గురూత్తమునికంఠం, బిందులోనున్న ధ
ర్మరహస్యం బెఱిఁగింపవే? దయ దలిర్పన్, మౌనిలేఖర్షభా! ౫

"తనయా! జూదపుసొమ్ముకూడ" దనినంతన్, రాజరాజాంబికే
యునివాచాపరిబద్ధుఁడై, యొసఁగ లేదో! గెల్చుకొన్నట్టి భూ
మినిఁగొం తేయుల,కిందులోసుగుణ మేమీ లేదు కాఁబోలు! ని
చ్చినదే మేలని చేయుసాఁపఁడె మహర్షీ! ధర్మజుం డోడియున్.

అకటా! ద్రోణునిమట్టిబొమ్మకడ, విద్యాస్వీకృతిం జెంది నం
దుకుఁ, బార్థుం డల యేకలవ్యుని నిషాదున్ జూచి మన్నింపనో
పక, యంగుష్ఠముఁగోరుకొమ్మని యొఁజాపాచార్యుని, న్మత్స్యగం
ధికుమారా! కురురాజు స్వార్థపరుఁడౌనే? క్రీడితోఁ బోల్చినన్.

తనసాపాటుబలంబు నమ్ముకొని, యుద్దండంబుగన్ దట్టి గ
ట్టినభీముండును దొండిచేసి పడగొట్టెం బాప, మారాజరా
జును, గౌరవ్యుల దుష్టకార్యములతో జోడించినన్ దీఱునే?
వినువా రుండినఁ జెప్పువారలకు లేవే? వ్యర్థవాదాంశముల్.

## 25. రచ్చగెలుపు

పూర్వచాళుక్యభూపులరత్నసదనంబు
తెనుఁగు మొక్కలు నాటుకొనినతోఁట
శబ్దశాసనునిభాషాభారతీసేవ
ఫలసిద్ధినందిన ప్రాఁతనేల
దక్షిణగంగ, తాతలనాటికథలు సె
ప్పుచు నెల్లపుడు సాఁగిపోవు తెరువు
ఉద్దండకవిధాటి కొండలు పొంగులువాటి
హర్షాశ్రువులు నిమ్ము నగ్రభూమి-
రెడ్డిరాజుల ఖడ్గవారిదమునీడఁ
బండుసత్కీర్తి పూఁచినపంట చేను
ఎడమచరణాన బిరుదంబు దొడిగి, సుకవి
మదగజము లేగునెలవు, రాజమందిరంబు. ౧

చిచ్చఱకంటివానిసతి, సింహము నెక్కి సవారిసేయు నం
దిచ్చటఁ, బూర్వదక్షిణమహిం బరిపాలనసేయఁ బుణ్యపుం
బిచ్చకు బ్రాఁతియే? నగరవీథులఁ, బూర్వచళుక్యసంపదల్
ముచ్చటసెప్పఁ, గన్నుఁగవ మూసి, మనంబున నాలకించిరే.

అరచాటైన ముసుంగుతోఁ, గలికియొయ్యారంబుతోఁ, దెల్గుసుం
దరి; మాసన్నయభారతంబు, పతిచెంత న్నిల్చె నిచ్చోట, భా
సురకీర్తిన్ జెలువారుపండితకవీశుల్ పుట్టుతా, విచ్చటన్
జనాంబుల్ చలియింప, నేసునుచు వాచానైపుణిం జూపిరే?

ఈదృక్ప్రాంగణ రాజమందిరములో, నీ వేంగి దేశంబులో,
నీదిగ్దంతులు గూడియున్నసభలో, నీపూర్వచాళుక్య రా

డాదిత్యప్రభ తేజరిల్లినప్రపూజ్యక్షోణిలో, సాంద్ర మ
ర్యాదన్జెంది, మదీయవాణియుఁ బవిత్రంబయ్యె, జన్మంబుతో.
ము ‘గున్నేశ్వరరావు’ వారిచరణంబుల్గొల్చుచు, న్నాఁడు తీ
యనిగోదావరినీరు ద్రావితిని, నాల్గైదేడు, లామీఁద వ్రా
సినకబ్బంబుల కబ్బెనో, మధురిమ శ్రీ, తెల్గుదేశంబు మ
న్ననఁగొంటిం, గానుచుంటిఁ, దన్మహిమలుం డంబోలు, నిన్నటికిన్

ఆదిని రుక్మిణీపరిణయంబును వ్రాయుచు, నిన్నదీశిలా
వేదుల విశ్రమించితిని, పెక్కుదినంబులు, కావ్యవీథులన్
జేదఱఁజెందు నాహృదయసీమ రహింపఁగ నీచు నంబుజా
మోదము, వీచికాపవనముం దనువు న్గదలించు నిప్పుడున్.

చకచక లీనుతొమ్మిదిరసంబులు చిప్పిలు మేలికావ్య సృ
ష్టికి జిగి యందెవేసిన ప్రసిద్ధకవుల్గలరీ పురానఁ, “దా
నొక కవి యయ్యె నిందు” ననుజ్జ్వలకీర్తికి నోఁచికొంటి, నం
గకములు పుల్కరించెఁ, గల గాక నిజంబగునేనిఁ, బుణ్యుఁడన్.

గౌడడింఢిమభట్టుని కంచుఢక్క
పగులఁగొట్టించు కవిసార్వభౌమునిల్లు
భాస్కరునికత్తి మెఱసిన ప్రథనభూమి
శిరము నెరపిన వినుకొండసీమ మాది. ౪

రాయనిమంత్రి భాస్కరధరావరుఁ డేలినవీటఁ బుట్టియున్
సాయము లేక, నాశ్రునయనంబుల నా రచియించు కైతకున్
గాయము పొంగి, నాకొసఁగినాఁడొక బ్రాహ్మణదాత, వేయిరూ
పాయలు, క్రుంగిపోవు రసభావపరంపర మోసులెత్తఁగన్.

అంగీకారము సూపి మద్విరచిత వ్యాసంబులన్, భారతిన్
శృంగారించినవిశ్వదాతలను బూజింతున్ మహాభక్తి, నా
లంగా గట్టి నెఱుంగనట్టికృతిబాలాజాలమున్ మెచ్చుచున్
మాంగల్యంబును గట్టినట్టి బుధులన్మన్నింతు, నశ్రాంతమున్.

ఆత్మప్రసాదము

తెలుఁగువాఙ్మయలక్ష్మి కలికిదేహమునందుఁ
గలదు నా నిర్మాణకలన కొంత
నూఱుతేకుల నేటి భారతీప్రసవాన
దాఁగు నా తేనెబిందువులు కొన్ని
సకలాంధ్రకవికోటి జాబితాలోపల
నానామమునకు స్థానంబు గలదు
పండితుల్ మెడఁజుట్టి పంపిన బిరుదంబు
లున్నవి నాకడ నొండు రెండు

కవికి వలసిన కొన్ని లక్షణము లెట్లొ
పెద్దలయనుగ్రహమున లభించెఁ గాని
ధాత్రి నిశ్చింతముగ జీవయాత్ర గడపు
లక్షణము లేదుగద, విక్రమక్షితీంద్ర! ౧

అంతరము లెఱిఁగి కవులకు
సంతోషముఁ బంచిపెట్టు సామర్థ్యము, భూ
కాంతులు సత్కవు లగు తమ
కెంతేనియుఁ గలదు విక్రమేశ్వర యింతే! ౨

ఈ కవిగానిజీవిత మదిట్టులఁ గష్టసుఖాలమధ్యఁ, బిం
డీకృతమై నశింపవలెనే? నరనాథ ! తెలుంగువాణికిన్
జాకిరి చేయసాఁగి, కడచన్నవి పాతికవత్సరాలు, నా
యాఁకటిపాట మాన్పినమహాత్ములు లేరు, రసజ్ఞశేఖరా !

ఆలయమం దముద్రితములై, తెరచాటున డాఁగియున్న బి
బ్బీలకిధాన మత్కృతులు పెక్కులు వ్రాఁతలతోఁ గృశించుచు
న్జీలిక లయ్యె, నుద్గతి నశించె, విచారము కాఱుచీఁకటిం
బోలి యెడందలో నిలిచిపోయె, సుమింపవు క్రొత్తకబ్బముల్.

ప్రాయంబున్, గవితాచమత్కృతి, నశింపంజొచ్చె, సంసారబా
ధాయాదోధితరంగసంహతివిధూతం బైనచిత్తంబుతో,
వేయున్నూటపదారు లందికొన నువ్విళ్లూరునాకైత కిం
కేయొయ్యారమునిల్పి, యేసొగసుఁ జేయింతుగా? దయావారిధీ!

## 27. జయంతి

విమతోద్దండుఁడు కృష్ణరాయనియరబ్బీగుఱ్ఱముల్, సాంపరా
యములో దామలకోయఁబడ్డ తలకాయల్ పిండిగా, రక్తనా
ట్యము గావించినవీరభూములకు నాహ్వానించి, నా జన్మ ధ
న్యముఁగావించినమీకు నావలపుఁగానుక, ల్గోసెఁడర్పించెదన్.

ఆంధ్రిశారద కృష్ణరాయనికొలువున
మునుపు దీర్ఘాయువులు పాసికొనకయున్నఁ
బొరయునే మీకు నాకుఁ జుట్టరిక మిటులఁ
గలుగునే నేటి యీవార్షికములగోడవ ౨

ఇపుడు ప్రపంచవైణికుఁడు, కృత్రిమయుద్ధకఠోరగానమా
లపనము సేయసాఁగె, శుభలక్షణలక్షిత మైనశాంతిమం
టపమున, ధర్మదేవత వడంకఁ దొడంగె, నికృష్ణ మైన స్వా
ర్థపరత చియ్యవట్టినది, రాఁగల గాలిదుమార మెట్టిదో ! 3

చీనాపడంతికుచ్చెలవంటి సాంఘిక
ప్రతిబంధము లన్ని పగులఁ దన్ని
సరిక్రొత్తయుగమునకు నెత్తురు వోసి మేల్కొల్పఁ
గల తేట తెలుఁగుకైతలు పఠించి,
సమయంబు నెంతేని నమిలి మ్రింగి పురాణ
గాథావశేషలకు, సమాధిఁ జేసి
భావదాస్యమునందు బంధించు చిలిపి వి
శ్వాసంబులకు ఫులుస్టాపుఁ బెట్టి
ఆధునికనాగరకతామహాపిశాచి
కోఱలకుఁ జిక్క, ధీశక్తిఁ గోలుపడక,
నడుపుకొనవోయి ! స్వీయవిజ్ఞానరథము
బ్రతికిచెడియున్న వీరభారతికుమార ! ౪

## 28 తుపాను

కొమ్మ పుట్టెఁడునీడ గుఱియ వీఁకెనుమఱ్ఱి
పాంథుల నొకశతాబ్దము భజించె
గొల్లాపురపుసత్రికొలుపుల కీచింత
తొలిపూవు కులుకునవ్వులు వెలార్చె

యెఱగాలికి అవునాఁ డీనింబతరుశాఖ
లంబాడిదయ్యె మలంకరించె
గరుటాలమంతు. డాఖరికాన్కు లీజువ్వి
పైకొమ్మపైఁ దెల్లవార్చికొనియె

ధరణిఁ బుట్టిన నాఁటివృత్తాంతములకు
శాసనము లైనయిమ్మహీజములబ్రతుకు
మొన్నటి తుఫానుబీభత్సమున నశించి
మూఁడువారాలకథలోనఁ బూడిపోయె. ౧

చిలిఁతుఫాను దెబ్బలకుఁ జింది జలాశయమందుఁ బడ్డ పూవులముఖసమలం వొలఁగి పోవఁగ నేఁడు విలాసలక్ష్మి యూయెలల వసించుబిడ్డల ముఖేందులఁ గ్రమ్మఁగ లేదహో ! జలప్రళయనిశాటినొటఁ దలవాల్చిన మాతృవియోగమేఘముల్.

---

## 27. మేల్కొలుపు

కాలవాహిని యుగతరంగములనడుమ
నున్నదో ! లేదో ! భవ్యభాగ్యోదయంబు
ఎల్లదిశ లొప్పు లొలుకఁ బ్రొద్దెక్కిపోయె
భరతజనయిత్రి ! కన్నులు తెఱువ వేమి ? ౧

తరముల్ పెక్కులు కాలచక్రమున నంతర్థానముం జెందె, నో
దరదేశంబు లఖండవైభవసముద్రస్నానముం జేసెఁ బే
దఱికంపుంబొగదుమ్ముగుమ్ములఫొఁతన్ దాండవంబాడ, నో
మరిదానింబలె మిన్నకుండెదవు లెమ్మా ! కచ్చ బంధింపుమా.

పఁడదమ్మా, యివి ప్రాంతనాటకము లభ్యస్తంబు గావించి, నీ
తలఁపు ల్సాగక మొద్దువాఱినవి, నూత్నజ్యోతి ముట్టించుకో
వలె, నుత్సాహసమేతులయ్యు సుతు లీబంధాలలోఁ జిక్కి, దు
ర్బలులై నారిఁక నూఱిపోసికొనవే! స్వాతంత్ర్య బౌషధుల్.

ఉ॥ నివి పిచ్చినమ్మకము లుప్పాకు రానివి నీయెఁడందలో
నెన్నఁడు సొచ్చెనో, చరణమెత్తి, శుభాశుభము ల్గణింతువో,
యున్నతురాల! ఈపిటికియూహల కాసహుతివై, ప్రయత్నము
ల్సన్నవి రిత్తలై, యవి తలాఁ గడంపు మభీష్టసిద్ధులన్. ౭

సకలశుభములు నీసమక్షమునఁ జేఁపి
నిలిచియున్నవి వేల్పుటావులవిధానఁ,
బిదుకుకోనవమ్మ! బంగారుబిందియలకు
నాలసించినఁ బరులపాలగును బాలు. ౭

అటఁగనుగొమ్ము! పశ్చిమమునందుఁ, దురుష్కులసుందరాంగ, చీఁ
కటిపరదాలతోడ బురఖా దొలఁగించి, సమంచితాశయ
చ్ఛటలు చిగుర్పఁగాఁ జదువుసంధ్యలు నేర్చినదమ్మ! విద్యకై,
గుటకలుమ్రింగ నీయనుఁగుఁగూఁతులకిమ్ము, కలమ్ము, ఖడ్గమున్.

## ౩౦. కవిప్రశంస

గంటలు గొట్టిమీమధురకావ్యములాంధ్రుల మేలుకొల్పి, యిం
టింటను బాడుకొన్నవి, కవీశ్వర! కోఁతకు వచ్చియున్న మీ
పంటను గోసికొమ్ము తిరుపత్యభిధానుఁడు లేఁడు, భాగముం
గొంటక, నీవిచారమునఁ గుందెద వింతకు వేంకటేశ్వరా!

తెలుఁగుజగాన నేఁడు గడిదేఱి, శాలకవీంద్రు లెల్ల, మీ
పలుకులపందిటం జిగురువట్టిన మొగ్గలు మీవిధాన కౌ
శలమున నూఁగిపోయిన దిశావలయంబు ప్రసాదబుద్ధిమై
వలగొని, మీకొసంగెదను పాయనముల్ గొనుమయ్య! సత్కవీ!

కొబ్బరికాయపాకమునకుం గుఱియై, తల బొప్పిగట్టు ప్రాఁ
గబ్బములెల్ల మూలఁబడఁగా, నొకతీయనిత్రోవఁద్రొక్కి, మీ
రబ్బురపుం ప్రబంధములనల్లి, దిశావిజయంబుఁ గాంచినా
రుబ్బునఁ, గీర్తిడోలికల నూఁగితి రేమఁ వచ్చు మిమ్ములన్!

ఎదురై మిమ్మదలించి గెల్వఁగలవాఁ డీయాంధ్రదేశంబునం
దుదయింపం డిపుడు న్నిరంకుశులరై, యూరూరఁ గ్రీడించి నా
రది మీపుణ్యఫలంబు, వేంకటకవీంద్రా! సాంద్రకీర్తిద్యుతిన్
ముదిమిం గాంచినమీ కలంబుల కివే పూజానమస్కారముల్.

నీవుం దిర్పతియున్ సభాంతరముల న్నేర్పుం బ్రదర్శించి, వి
ద్యావైశద్యము గల్గుపండితకవీంద్రశ్రేణితోడన్ సవాల్
గావింపం బులకించిపోయిన విశాలం బైనయాంధ్రోర్వి, మీ
శ్రీవృత్తంబుఁ దలంచి, చెప్పుకొనఁబొచ్చెన్ దేశదేశాలతో.

ఇలు దాఁటి నీవు రావలెఁగాని నీపదం
బులు నమస్కృతులలో మునిఁగి తేలు
చేసాఁచి నీవు యాచింపగవలెఁగాని
మణులతో నీకొంగు దొణఁకిపోవు
తలఁపూని నీవు చేఁ గల మందవలెఁగాని
సిసలైన కవనంబు సెంగలించు

మతి నెంచి నీవు సమ్మతి జూపవలెఁగాని
బిరుదాళి నీఱొమ్ము తుఱఁగలించు

నీదు షష్టిపూర్తి నెఱపి మా బందరు
నిఖిలదిశలఁ బూజనీయ మయ్యె
వార్ధకమున గౌరవకిరీటమును బూని
సంచరింపు మయ్య! సత్కవీంద్ర! ౬

ఏఁడీ నీకును దోడునీడ, చెలికాఁడే మాయె, సాహిత్యస
మ్మోదాఖండసలుండ్లైనతిర్పతి? కవీంద్రా! జోడుతోడాలతో
మోడాకాలి నలంకరించి, మిము నెమ్మిన్ మేము పూజింపఁగా
లేఁ, డేమందుము? కాలరాక్షసకరాళీభూతదుర్మక్రియన్ ౭

## ౬౧. జాకి

ఏకాలంబుననో! ఋణంబువడి నన్నిన్నాళ్ళు సేవించి, నేఁ
డీకాయంబు పరిత్యజించితివి, జాకీ! నాకు మర్యాదతోఁ
దోఁకాడింపుల స్వాగతంబు లిడి సంతోషించు నీదృష్టికిన్
నాకన్నన్ మొనగాఁడు నుత్తముఁడుఁగన్పట్టండుగా! యుర్వరన్.

పెట్టుంబోఁతలు సన్నగిల్లె ననుచున్ విశ్వాసహీనాత్ములై
చుట్టాలుం జనినారు, నీకడుపుఁజిచ్చున్ దీర్పన్ మృష్టాన్నమున్
బెట్టన్ జాలనినాయెడ న్నలుగునీ ప్రేమానుబంధం బహో!
పట్టు న్వీడదు, నీకృతజ్ఞతకు నాస్వాంతంబు నీరయ్యెడిన్. ౨

ఇల్లేమైనది? నీవునుం బయనమై యేతెంచియున్నావు, నీ
చెల్లాటంబులు గట్టిపెట్టు మని కొంచెం బేను గోపించుచో

నిల్లాలింబలె, మోము వంచుకొని యడ్డే యింటి కేతేరవో
యల్లాపెంచిలినాఁడు, నీవినయవిద్యాలీల లూహించెదఁ
'హృదయముచీల్చిచూడుమిదియిచ్చకమో' యభిమానమొగ్రహిం
చెద' వని యాఁకటనొప్పిగిలి చిక్కినగర్భముఁజూపి, యెన్నియో
బదవలు వడ్డ నే నెడమపాదమునఁ బ్రహరించుచుండితిఁ
బదము లు నాలుగున్న యొకభక్తుని నిన్నుఁ బరాభవించితిఁ.

నోరు లేదుగాని చేరి నీ వొనరించు
పనులలోన వింతభావ గలదు
నీవు నేను దప్ప నితరు లెఱుంగరు
కనులతోడ నవ్వఁగలవు నీవు. ౫

చెలికాఁడు నిన్నుఁబోలి యింటికడ గస్తీసేయునా? విచ్చుక
త్తులతోఁ బైకొను వోరుఁలఁ గవియ నుద్యోగించునా? నాకునై
బలియై, ప్రాణము లొడ్డువాఁ డెవఁడు? నా బంగారుజాకీ! నమ
స్సులతో నీకు సమాధిఁ జేసితిని, నశ్రుస్నాన మాడించితిఁ. ౬

వాసనఁ జూచి నాయకుఁడు పాదము లూడినతా వెఱుంగు న
భ్యాసము సేయుభృత్యుఁడుప్రపంచమునందొకఁడున్నవాఁడె! వి
శ్వాసము నీకులానికి నిసర్గవిభూషణ మమ్మ! యిట్టి సా
వాసము చచ్చిపోయినది బాహుబలం బుడిపోవుకైవడిఁ. ౭

'ఎవఁడవు నీవు? రావలవ దిచ్చట స్వామి శయించినాఁడు నీ
కవమతి వచ్చుఁ బొమ్మ'నెడు నర్థము దోఁప నదల్చి, భీకరా
రవములు సేయుచుండెడవు రాత్రులఁ జీమ చిటుక్కుమన్న, బాం
ధవులకు లేవిగౌరవము నాయెడ నీ కెటు లబ్బె నాపుడా! రా

ఒడయం డొంటరిగాఁడు, కష్టములురావో? యర్థరాత్రానసం
చడుగుంజాడల వెంబడించెదవుగాదా? జాకి! నీ విప్పు డి
క్కడ ‘ శ్వాసములేని నిద్రవడి యింకన్ మేలుకో వేలకో!
నడునం బాదము లాడకున్నయవి శ్వానస్వామి! నీస్వామికిన్.

## 32. చీట్ల పేక

నాలుగురంగుల వాలుజూపులసాని,
అతికాలభుక్తికి నాటపట్టు
గెలిపించి యోడించు కులుకునవ్వులపిల్ల
కలహమ్మునకు నిండుకారణంబు
వ్యసనవల్లికలకు బలమైన చేయూఁత
తొలఁగించుకొనరాని జెఁగపట్టు
ప్రొద్దెఱుఁగనిమోహమునకుఁ జింతామణి
నలునిల్లు గూల్చిన నంగనాచి

నెత్తిగొఱిగి పంపునెల్లూరి నెఱజాణ,
కితవజాండములకు బ్రతుకుఁదెరువు
త్రాగుడునకుఁ గొంత దగ్గఱిచుట్టమ్ము
చేతిడబ్బుపోక, చీట్లపేక.

జోకరుగానిఁ దోడుకొని, చుక్కలచక్కదనంబు మీఱి, "మూ
ఁడాకులయాట, యెత్తిళులు, నడ్డు, షర" త్తనిమ్రోయుచున్నయో
పేకబాజంగి నన్ను వలపింపకు మింతట బుద్ధివచ్చె, నీ
మూకులపాటులోఁ గలుగు నాకులపాటుఁ దలంప సిగ్గగున్.

అంగీకార నినాదముల్, పటుతరవ్యాహారముల్, భ్రూకుటీ
భంగాక్షేపణముల్, పరస్పరజయవ్యామోహవాదధ్వనుల్,
సంగీతంబులు, కూనరాగములు, సీలల్, దీర్ఘనిశ్వాసముల్,
నింగిన్ దాకుచునుండు, నీదురితకేళీరంగమధ్యంబునన్. 3

విఱుపేకన్ గరుణించి పాపమని కానీ ధర్మ మర్పింపఁ జి
ల్లర లేదంచుఁ గొలంగులుబ్బుఁడు, సముల్లాసంబుతో మేటి తెం
పరియై, నూటికి నూఱు లొడ్డి విరమింపఁడక్కటా! పేకసుం
దరి! నీముక్కలు, మోహనాస్త్రములు చింతాసౌధసోపానముల్.

'అనుగుంబిడ్డఁడు బావిలోఁబడియె నన్నా! లేచిరమ్మన్నఁ దె
చ్చిన దీమార్గమె కాయటంచు వచియించున్ జూడగా డందురిం
దున సందేహము లేదు, కేవలము మందుండై విషంగ్రస్తుఁడై
తనరున్, రంగ మలంకరించిన మహాతత్త్వజ్ఞుఁడున్ బ్రేల్మిడిన్.

గెలుపా! యూయెల సంశయంబునకు బ్రొగ్గెన్, బేస్తులా, [రెండురూ
కలపైచిల్లర, కుదేళు లిచ్చుకొన నింకం బావులాకాని గా
వలె, నీఘోరవిపత్తు మస్తమున సంప్రాప్తించెనా! వాఁడు 'వి
హ్వాలనాగేంద్రము పాహి! పాహి!' వఱకై యజ్ఞాక్షుఁడున్ [రావలెన్.

పేకయాటలోని పింఛనీదారుండు
చుట్ట త్రాగుకొనుచుఁ జూడ వచ్చి
చెఱచి తనుచు ముక్కు చిట్లించుకొనిపోవు
పేకయాట గుండెపీకులాట.

## 33. ఆశ్వాసము

రవిజుని పేరు నాపిటికి రక్తపుగుండెలలోనఁ జొరుప
చ్ఛవుల నలంకరించినది స్వాతిశయంబునఁ బొంగిపోయి, నా
కవనము తెల్గుజోదులముఖంబున గీతిక లాలపించి, పె
ల్లవమతిచేఁ గృశించుకమలాప్తతనూభవు నూఱడించుతన్. ౧

నీపేరెత్తిన నామనఃకుహర మందీభూతమై, క్షుబ్ధమై
వపోవున్, దనువెల్లఁ గంచుకితమై వ్యాలోలమై పొల్చుఁ,గ
ర్ణా! పౌరందరుఁడేయుబాణములయన్యాయధ్వనుల్ నాచెవిన్
రాపాడున్ గఠినంబులై, మన విచిత్రస్నేహ మూహించితే. ౨

రవిజా! భారతసంహితం జదువ నారంభించి, నీతోడ నా
హవమున్ జొచ్చిననామనంబవలిదృశ్యంబున్ సమీక్షించి, యో
రువలే దీవు గతించిపన్ దగినపేరుం జెవ్వఁడుండున్, గథా
సవమంతన్ జవి లేసిద్దై, పొడమి, యుత్సాహంబు ఛేదించెడిన్.

దెసలం బుక్కిటఁబట్టుకొండొకమహాతేజస్సమూహంబు, నీ
లసమానాకృతినుండి లేచి, రవి నాలంబించుచో, వైరిమా
నసముల్ నీకు నమస్కరించినవి, కర్ణా! వీరచూడామణీ!
యసువుల్ వోయిననేమి నీయశము బ్రహ్మాండంబునోలార్చెడిన్.

ఒక్కొకబాణఘాతమున నుఱ్ఱటలూఁగిన పార్థు తేరిపై
జెక్కెమునందుఁ గొండలపడెన్ గపిరాజు దినేశపుత్ర! నీ
చిక్కని బాహుసారము రచింపక పోవఁడు, సూర్యశిష్యుఁడై
నిక్కము వల్కువాఁ డతఁ డనింద్యచరిత్రుఁడు సత్కవీంద్రుఁడున్

## 34. సార్వభౌమనిర్యాణము

ఇనునకుఁ జావులేని జగమేలుమహోన్నతకీర్తిశాలి, న
ల్లని మన భారతావని విలాసిని మెచ్చిన శ్వేతభర్త, వం
దనము లొనర్చుచున్ శతశతఘ్నులుమ్రోయఁజరించుజార్జి రా
డ్డినమణి క్రుంకెనే; చరమదిక్సతి చీఁకటిచీరఁగట్టఁగన్. ౧

కనుఁగొ మ్మల్లదె! మిత్రమండలి పతాకాకుంచితగ్రీవమై
వినిపించున్ దనసార్వభౌముని మృతిన్, విశ్వప్రపంచంబు మో
మున నాభీలవిషాదరేఖ మసలెన్, మూల్గెన్, బకింగ్‌హాము భ
ర్మనిశాంతంబు పునాదిఱాలు పులకింప, న్నీలిదీపాలతో. ౨

ఈ దేశాల నఖండవైభవముతో నేఁటేటఁ బుష్పించు ఢి
ల్లీ దర్బారు, చరిత్రలో నొదిఁగి తాల్చెన్, నీయశోమూర్తి రా
జాదిత్యా! ప్రపితామహాది గురు లాహ్వానించిరో, మింటికి? కే
మా దేశింతువు నీకుమారులకు, రాజ్యశ్రీకి, నిల్లాలికిన్? ౩

కోహినూరు వజ్రదీపం
బహర్నిశల వెలుఁగు నీగృహంబున లేదా?
మహాసీయసౌఖ్య మెందుల
కిహము విడిచి స్వర్గపురికి నేగితివి ప్రభూ! ౪

మూఁడుమూర్తులు నీవుగా ముద్దు లొలుకు
వేల్సుయువరాజు నీప్రతిబింబ మగుచు
మకుటమును దాల్పనున్నాఁడు మస్తకమున
దివిజులను గూడి యాశీర్వదింపు మనఘ! ౫

## ౩౫. ప్రబోధము

పండినపొలాలమంచెలపయి వసించి
కొదమబెళగువ్వతో గావుకూఁతఁ బెట్టు
కాపుపడుచుల తెలుఁగుశృంగారకలన
చెక్కు చెడలేదు, మెరవు దెచ్చినది లేదు. ౧

అనుకరణంబునందుఁ దెలుగయ్యలు నమ్మలు దొడ్డవారు, కా
వున నివసింపసాఁగినవిపో, పెరవారిపసందు పోకడల్
తెనుఁగుఁదనంబు రాట్నమునఁ దీసెడు దారముతోడ మాల్గసా
గినది, పురాతనాంగనల గేయములన్ శ్రుతి గల్పి పాడుచున్.

ఓకాఫీతపసీ! తెనుంగునకు నాయుఃప్రాణముల్ గ్రుంగి, హిం
దీకిన్ గల్గును చోటు లేదనుచు వాదింపం బ్రయత్నింతువా?
ఆకర్షించువిదేశవాసనల కిల్లై యున్న నీయింటియం
దీకాసంతలు రాష్ట్రభాషలకు లేవే? తావు లూహింపగన్. ౩

ఆవమతి వచ్చునో! తెలుఁగుటంగనచక్కదనంబు, మాటమా
ర్దవమును లెక్కసేయవు, సదా పొరుగిండులపుల్లగూరలోఁ
జవులు వచింతు నీసహజచాపల మూడునె' యింగిలీషు చి
ల్కవు, వచియింపనేర్తువే, బలా! చిరకాలపు రామశబ్దముల్

నాగజెముడుపురుగులాగున నీ చుట్టు
మూఁగియున్న నేఁటినాగరకత
తెలుఁగుఁదనముతోడఁ దినివేయదో, నీ య
శోలతాంతములను వాలకమును. ౪

## 36. ఆవేదన

పగలు గూబలు రాతిరి పావురంబు
లేలుబడిసేయు జీర్ణదేవాలయమున
వెలుఁగుచున్నది నేతిదిబ్బెములవరుస
చిలిపిచీఁకటి నాయింటఁ జిక్కుఁబడియె. ౧

ఆశిలావిగ్రహంబున కాహుతి యయి
పోవుచున్నది నా పేదభోజనంబు
నోరెఱుంగని జీవజంతువులతలలు
పొరలుచున్నవి దానిమందిరము నెదుట. ౨

ఎమ్ములను బిండి, మూలుగు లిగిరిపోవఁ
గృషియొనర్చెడిపశువుల నెండగట్టి
ఱాతినందికి గందపుఁబూఁతఁ బూసి
మ్రొక్కుచున్నది భువనంబు మోకరించి. ౩

అరరె! బొందిని బ్రాణ మున్నంతవఱకు
జాలిపడువాఁడు లేఁడు ముజ్జగమునందు
చచ్చి, మరుభూములం దొకసత్తినగుచు
నిట్టు లోకమూఁగిబొమ్మనై పుట్టువఱకు. ౪

తాతముత్తాతల కపాలదామములను
గళమునం దాల్చియున్నవిగ్రహమునెదుట
కుప్పిగంతుల నిడు మేఁకకూనమనసు
కలఁతఁజెందదు, ప్రిదిలి ముక్కలయి చనదు. ౫

మరణ మెఱుఁగక యజమానిపిఱుఁద నడచి
హేతిపాలైన శేఁతచింబోతుకనులు
మూఁతవడ లేదు, కన్నీట మునుఁగ లేదు
వెలుఁగుచున్నవి గాజుబిళ్ళలవిధాన
నిట్టలపుటచ్చెరువు గ్రుక్కపట్టునేమొ ' ౬

బందుగుల ప్రాణములతోడ బంతులాడు
ధవునియానతి గుడికేఁ బ్రదక్షిణించు
నెల్ల కైభాషతో నెవ్వఁ డెంకపఱచు
నుజ్జ్వలం బైన సత్యాగ్రహోద్యమంబు. ౭

ఆపవిత్రకవోష్ణరక్తాంకిత మయి
ఆర్ద్రమైనతదాలయప్రాంగణమున
శ్రుతిపురాణేతిహాససంగతము లైన
శీర్షములుగూడ సవినయశ్రీ వహించు. ౮

అది మతావేశపరులవిహారభూమి
యట సహింపఁ దావు రవ్వంత లేదు
'కాదు వల' దన్న బౌద్ధభిక్షుని కుతిక
నులుముచున్నారు పురిటిబెబ్బులులపగిది. ౯

Printed by Vemkatram Power Press, Ellore.
P. I. C. No. W. G. 1.Dec. 1946/1000 Copies.

# ఖండకావ్యము

## మూడవ భాగము


రచయిత:

కవికోకిల, కవితావిశారద, ఉభయభాషా ప్రవీణ

జి. జాషువ కవి

వినుకొండ





పబ్లిషర్సు:

వేంకట్రామ అండ్ కో.,

బెజవాడ – మద్రాసు

1947




[వెల రు 1—0—(

# ఖండకావ్యము
## మూడవ భాగము

రచయిత.
కవికోకిల, కవితావిశారద, ఉభయభాషా ప్రవీణ
జి. జాషువకవి
వినుకొండ



పబ్లిషర్సు:
వేంకట్రామ అండ్ కో.,
బెజవాడ - మద్రాసు

1947

 [వెల రు 1—0—0

మనమును మాటయు నొక్కటై
తనరారెడు క్రమకులజు దానపరుని పే
రొక్కనవాఁడ నలరి మవ్వపు
గొనముల వనరాజు బుచ్చికోటయ భోజున్.

రేయింబవళ్ళు నాదు స
భాయోషిజ్జయము గోరి పాటువడిన కా
ర్యాయత్తమతికి రామయ
నాయని కగుగాత! భవ్యానవ్య శుభంబుల్.

—జాషువకవి

# ఖండకావ్యము

## మూడవ భాగము

## 1. కన్నతల్లి

కనులలోఁ బుత్రుఁడు మేను గదలుచుండఁ
దనువెఱుంగక కన్ను గూర్కొనదిలేదు
చిక్కఁజీఁకటిఁ గుంకుడు చెట్లనీడ
నిదురబట్టినదా తల్లి! నేడు నీకు.

ఇల్లున్ వాకిలి లేనిదానివలె, నేడీ శాకినీ ఢాకినుల్
బిల్లల్ సేయు శ్మశానభూములను బ్రాపింపంగనేలా? జగం
బెల్లన్ జీఁకటిముద్దయై పడమె తల్లీ! నీ వియోగంబునన్
జిల్లుల్ వడ్డది మానసం బుబికి వచ్చెన్ వేదనానీరధుల్.

నేనును తమ్ముఁడున్ గలసి నీవు పరున్న సమాధిపెట్టియన్
బూని భుజాన దాల్చితిమి పున్నెము మూటవహించులీల, నీ
మానసమోర్చెహా జననీ! మాకు నొకించుక భారమైన, నం
భోనిధులెన్ని పెల్లగసి ప్రోసినవో మముఁగన్న కడ్పునన్.

ఒంటిగనుందువా యిచట? యూరికిబొమ్మని యాజ్ఞయిత్తువా?
కుంటుచుఁ గఱ్ఱతో నెదురుకో లొనరించుచు ముద్దులాడు, నీ
వింటను లేకయున్న సుఖమెక్కడిదే మముగన్నతల్లి! కా
గింట నమర్చి మేను పులకింపఁగ దీవెనలిచ్చి పంపవో!

నలువదియేండ్లు దాటినవి నాకిపుడున్ ననుముద్దులాడు, ము
ద్దులజననీ! భవన్మధుర దుగ్ధము రక్తము రంగరించి, యు
గ్గులనిడినావు, నీహృదయ గోళములోపల నేను దమ్ముడున్
మొలగని తావులేదు గణనీయము నీజననీత్వ ముర్వరన్.

కొడుకులను మమ్ముర వాసాలకోలను జేసి
మురిసికొని చంద్రశిలలీల గరఁగినావు
పుణ్యములతల్లి! నీపాలపుష్టికతన
కవనబాలిక నాజిహ్వ నవతరించె

తరుగింతేనియు లేని నీమహిత పుత్రప్రేమ, యేతల్లికిన్
బురమాయించి త్యజించి పోయితివి మమ్మున్నీ శరీరంబుతో
మరణాంతంబున జన్మమే కలిగినన్ మాతల్లి! నీకడ్పునన్
మరలన్ బుట్టెద వేయిజన్మములకున్ దమ్ముండు వెంటాడఁగన్

నిరుడీనాటికి గల్గునీమహిత సాన్నిధ్యంబు నేఁడక్కటా!
మరుగై, నీవుపరుండుమంచ మొకటే మాకిందుప్రత్యక్షమై
పురికొల్పున్ బరితాపవహ్ని ననయంబున్ గర్భదేశంబునన్,
దిరిపెంబెత్తిన జూపువారెవరు? ధాత్రిన్నీ శుభాకారమున్.

ఎనుబదేడులవయస్సున దర్పితంబైన,
నీపెద్దతలకు మాణిక్యపూజ
జీవితేశుఁడు మన్నుజేయు నీ దివ్యమం
గళసూత్రమునకు నిక్కంపువినుతి

అమ్మలకాదర్శమై తాలుగరఁచు నీ
మాతృత్వమునకు నమశ్శతంబు
బలగంబుపూల పూజలఁదెల్ల వాఁడిన,
నీదీర్ఘనిద్రకు నీలిగొఁడుగు

నిన్నుఁదమిమీఁద తొమ్మిద నిలుపుకొన్న
నీసమాధికి వేదికనిల్చిపూత
కొడుకుల సుఖంబునకు మేను కొల్లబెట్టు
జీర్ణమూర్తికి నెత్తురు చిలుకరింపు.

నిత్యవిశ్రాంతి నానందనిలయమందు
విరుగుచున్నావుగాఁబోలు దిగులు లేక
సర్వసంసారబాధావిషజ్వరమున
కౌషధంబైన మరణంబు నభినుతింతు.

---

## 2. అశ్రుపూజ

నీవు లేనినాఁడు నే నాద్భవించితి
నీవుకల్గునాఁడు నేను లేను
నాల్గువందలేండ్లు నాకు నీ కెడమయ్యె
నెట్లుజూతునిన్ను కృష్ణరాయ.

నీవుగోమునఁబెంచి మన్నించినట్టి
తెలుఁగుశిల్పము నిన్ను చిత్రింపఁగలదు
పెద్దనాదుల కవనంపు ముద్దియలకు
సుకవిరాజన్య! నీ కవళికలు గలవు.

వేడికన్నీటితో సేదు విజయనగర
శిథిల భూములఁబడి పూజజేసినాను
తుంగభద్రానదీ పుణ్యతోయములను
క్రుంకులిడినాఁడ వెచ్చని గుండెతోడ.

తొల్లి నిన్నుఁగన్న తుంగభద్రానది
ఇదికియున్నదిపుడు పార్థివేంద్ర
నేటి తుంగభద్ర నిన్నుఁజూంగనియట్లు
నడచుచుండె సంగనాచివోలి.

దరిసెనమిచ్చె నీసతులతామరమేడ, కడానివన్నెలౌ
మరకల యుక్కునమ్మెటల దుండగముల్ బ్రకటించుగాయపుం
గుఱుతులతోడ, కృష్ణనృపకుంజర! బావురుమంచుఁదోచుకుం
జరముఱశాల, లారని విషాదము రేచె హృదంబుజంబునన్.

తలవంచలేదు విఠ్ఠలరాయదేవుఁడు
పటుశతాబ్దాభీల భారమునకు
నవసిపోలేదు సాసువుగణేశుఁడిబొజ్జ
బహుకాల దీర్ఘోపవాసములకు
తఱిగిపోలే దుగ్ర నరసింహమూర్తికిఁ
జక్షుర్ద్వయమున వెచ్చందనంబు
దసిలిపోలేదు కోదండరామస్వామి
తనువులో బిగువు కుందనపుఁదళుకు

జీవకళ దప్పలేదాంధ్ర శిల్పమునకు
విజయనగరాన రత్నాల విపణివీధిఁ
గృష్ణరాయేంద్ర నీవజ్రగేహసీమఁ
బురుఁగుమెదలదు పొగరాజుపోల్కి లేదు.

## 3. పశ్చాత్తాపము

నా దేశంబు సమస్త మానవ సమాజత్వంబు గుర్తించునో లేదో, సూర్యుని పుట్టినింటి దెస నోలిన్ సుప్రభాతోజ్జ్వల శ్రీ [illegible]నో! భావదాస్యమునఁ బ్రాచీనాంధకారంబులోఁ దంబూనునో! భావి భారతరథం బే మార్గమున్ ద్రొక్కునో.

పగవాని మదపు టేనుఁగు దంతములు దాకి
కదలిపోయినది నా కంచుకోట
చిరకాల దాస్యంపు టినుప పంజరమున
మగ్గిపోయినది నా మగతనంబు
అన్యభాషా మారుతాఘాతమున జేసి
వన్నెదగ్గినది నా వాఙ్మయంబు
కుల పిశాచమ్ముల కుమ్ములాటలలోన
స్రుక్కిపోయినది నా సుప్రతిష్ఠ

సీమదేశానఁ జదివివచ్చెద నటంచు
చేతిలోఁ జేయివైచి వచించిపోయి
మరలిరాదాయె నాదు సంపద్విభూతి
కట్టువడ్డది నా దొడ్డ కాపురంబు

ఆరాటాల కుటీరమధ్యమున సన్యాసినై యున్న గాం
ధీ రాజర్షి దరస్మితాంచితయా సందేశంబులం దించి, నీ
చత్వం బుపసంహరింపుమని నేర్పెన్ బ్రేమసిద్ధాంత మి
ట్లాచరింపంబడి కట్టకొందు నిపుడెన్నో మేడ లభ్యింబునన్.

పడుచుం బిల్లల ముసలికి
ముడిబెట్టితి, పసుపుం గుంకుములకు న్వాలినై
గడియించిన నా పాపము
వడువున నిపు డా యనాథ ప్రత్యక్షమగన్.

ఇపుడస్పృశ్యత బాపుకొం దలంతుగానీ, నమ్మరీపేద లీ
యుపకారాల్ గడగొట్ట తమ్ములది నాయుల్లంబు గారించి న
న్నుపహాస్యంబుల పాలుజేసెదని, మర్త్య స్పృశ్య నెగ్గించు నా
కృపణత్వంబును స్వార్థముం దెలిసిపోయెం దేశదేశాలకుం.

## 4. శిల్పి

పదియు నాఱుమంచు పలకలొక్కొక్కటి
కుదురుకొన్న చంద్రగోళమందు
చెవులపిల్లిబొమ్మం జిత్రించినాం డదే
ఆకసంబునందు నాదిశిల్పి.

ఇంద్రధనువులోని యేడువన్నెలశోభ
నెమిలిపింఛియమున నిలిపినాండు
భూ నభోంతరాళములం దాండవించెడు
వాని కుంచె మనకు గానరాదు.

కన్నుముక్కు నోరుఁ గడుపును గాయంబు
జెక్కినాఁడు నల్లచీమలోనఁ
దలఁచిచూడ వాని యులియెంతచిన్నదో!
యెంత సున్నితములో! మృదుకరములు.

ఎండుపుల్ల లొండు రెండెట్లు సంధించి
యూపిరెంతలోన నూదినాఁడో
గొల్లభామయగుచు కులుకుచున్నది
ఇంత కన్న శిల్ప మెందుగలదు?

పట్టుకెంపురంగు పడమటశుంభించి
యింపుగొలుపుచుండు హృదయములకు
సర్వలలితకళలు సవరింపఁజాలని
జీవశక్తి యతని చేఁగలదు

చందమామ వేడిసకు శర్కరముమీద
వెండినీరు చిలికి విడిచినాఁడు
దానిచక్కఁదనము దానియొయ్యారంబు
హాయిఁగూర్చుఁ దర్శనీయమగుచు.

ఊహాతోడ మనసు నుయ్యాలలందుంచి
చింతలెల్లఁబాపి చికిలిసేయు
సహజ కళలకున్న సాఫల్యమట్టిది
పలుకనేల, పట్టువడవు కృషికి.

# 5. ధర్మకిరీటము

నను నీవంటకె కంటగించుకొనుచున్నా వన్నచో నారము
గ్గినపండైన సబర్మతీతటి వసి, మూకీభావముం బూని, భో
జనమున్ ముట్టఁడు. సర్వలోకము తమ స్సంఛన్నమై, దద్దరి
ల్లును హిందూసుత, ముందు వెన్కలు సమాలోచింపు
మింపారఁగన్.

వడికినసూలుపోగునఁ బ్రపంచపుఁ జేన్గును గట్టి, ఆజ్ఞలో
నడపుమహానుభావుఁ డశనంబును మాని విరోధిగుండెలో
పిడుగులుగుప్పువాఁ డమృతబిందువులన్ దనబోసినోటఁ
జిల్కెడు ప్రతిలేనివక్త, ప్రణమిల్లుము గాంధి పదాలదాపునన్.

శబ్దగ్రహణయంత్ర సమితి నబ్ధులు దాటి
యూరేగినది వీని సారవాక్కు
అంటరాని తనంపు టసుర కుత్తుక నొక్కి
సమయించినది వీని జాలిగుండె
సత్యాగ్రహప్రవాసమున దిమ్మరవోయి
కడముట్టినది వీని కాయపుష్టి
సార్వభౌముని విందు సమయాన జమ లేక
విహరించినది వీని పిలకజుట్టు

సాధనము జేసె మహదహింసావ్రతంబు
వానిపాదాల జాతీయసోదరత్వ
ఆదిమాంధ్రుల ముమ్ముర్లనాదరింప
కరుణఁజిందెడు వీని వీక్షణాయుగంబు.

ఈ గుజరాతుకోమటి సహింపఁడు పంచమజాతిహింస, నీ
యాగమశాస్త్రబాలికల కాయువుగావలె నన్న స్వేచ్ఛలో
భాగమొసంగె నీ గృహము బంచకు బిల్వ సుగుంఫితేయులన్
శ్రీగలభారతీయ; సవరింపుము ధర్మకరీటమాడలన్.

'చిత్తము దేవరా'యనుచుఁ జెప్పినమాటకు నాటి కైక, నీ
యెత్తిడికేశకోట్ల జనమోర్చుచునుండె నవాదినుండియున్
బెత్తెడుభూమిలేని నిజపేదలమై, యిటు లంటుదోషమున్
గిత్తులబోసి లోనఁ గలకాలముఁ గ్రుళ్లి కృశింపమందువా.

---

## 6. తిక్కయజ్వ

మక్కికి మక్కి, మూలమును మారుపుసేయక స్వీయకల్పనా
ఫక్కికిఁ, దావొసంగి రసభావ పరంపర నాత్మశోభలన్
గ్రక్కి, తెలుంగు భారతము వ్రాసి సరస్వతి నుద్ధరించు మా
తిక్కనమంత్రి మండను నుతింపని జిహ్వ నిరర్థకంబగున్.

ఎఱ్ఱాప్రెగ్గడగాఁడు, నన్నకవిగాఁ, డింకెవ్వఁడుంగాఁడు, నీ
సారప్రజ్ఞ యనన్యసాధ్యము, కళాసౌరభ్య సంపత్తిచే
పూరాపడ్డది తెల్గు శారద, మరాబుల్ లేరు నీ నేర్పు బం
గారంబున్ వెలగట్టిచెప్ప, కవిశక్రా! తిక్కయజ్వప్రభూ!

శ్రీనిధియైన యమ్మనుమసిద్ధి బహూకృతులందినీవు వా
గ్గేనువు పిండిపోయునది తీయని మేలిపయస్సు, నేడు పెం
పూను తెలుంగునాళముల కూపిరివోసిన నీదు భారతం
బీనెడు నేటి కవ్వాలదహీ. చమత్కృతి రత్నదీధితుల్.

కలమున్ ఖడ్గముబట్టు వీరుడవు, నీ కావ్యప్రపంచంబులో
పల బ్రహ్మాండము నల్లపూసయయి కన్పట్టున్, మనుష్యప్రవృ
త్తులు నిన్నుం బలె నాకళించెడు సమర్థుల్లేరు, నీ పాద ము
ద్రలచే బోల్చు యశస్సు సింహపురికే దక్కెన్, గవిగ్రామణీ!

అల్లుండై నిను మామగారనుచు నాహ్వానించు రాజన్యుడున్,
నెల్లూరన్ నెలకొన్న దేవుడును, నీ నేస్తంబునన్ గీరితిం
గొల్లంగొట్టిరి తెల్గుదేశమునకున్ గొప్పందనంబబ్బె నీ
వల్లన్, నీ కవితాచరిత్రకు నమోవాకంబు విద్వత్కవీ!

తెనుగుభాషా లోకమును శిరస్సునఁబూని
నడిసన్న కుండలీంద్రుఁడవు నీవు
నృపతిగోల్పడియున్న నెల్లూరిరాజ్యంబు
మరలదెచ్చిన మంత్రిమణివి నీవు
భావచిత్రములు కుప్పలువోసి పఠితృలో
కమునేలు చిత్రలేఖకుడ వీవు
హరిహరాదులను దీర్ఘాయుష్కులం జేయు
కవనమల్లెడు సృష్టికర్త వీవు

దేశభాషకు రవ్వంతదీసిపోని
సభ్యతాస్ఫూర్తి తెలుఁగుభాషకును గూర్చి
గడనకెక్కిన మాతృభక్తుడవు నీవు
ధ్యేయుఁడవు మాకు చక్కని తిక్కమంత్రి!

# 7. తెలుగు వెలుగు

జననంబందె నపూర్వవైఖరులతో, సంగీతసాహిత్యమం
డన! నీ తెల్గుమిటారి చెన్నపురివీటన్ గర్జమ్రోయించుచున్
దనువుప్పొంగఁ బురాతనాంధ్రవిభవోద్యానంబు రేకెత్త, మో
హనగానంబుల నాలపింపగదవయ్యా! ఆంధ్రయోధాగ్రణీ!

ఒకనాఁడాంధ్రునికత్తి, శాత్రవజలవ్యూహాలపై రక్తనా
టకమున్ సల్పుట విస్మరింపకుము, గాఢంబైన పాశ్చాత్యశో
భకు నీవిప్పుడు లోఁబడైతివి, ప్రదీప్తంబైన నీప్రజ్ఞ నూ
రకపోనీక సముద్ధరించుకొనుమాంధ్రా! వీరయోధాగ్రణీ!

బోళావాఁడవుగాన నీదు విభవంబున్ సత్కళామర్మముల్
జాలాభాగము కొల్లబెట్టితివి, నీశాస్త్రప్రపంచంబులో
మేలైనన్ గబళించినారు పరభూమీశాగ్రణుల్, నేటికిన్
బోలేదేమియు దిద్దుకొమ్ము బలగంబున్ స్వీయవిజ్ఞానమున్.

తలికోటయుద్ధాన నళియరామునినల్ల
    ప్రిదిలిపోయినది నీ వీరదట్టి
మాయనాయకురాలి మారాముడులచేత
    శమియించె నీబాలచంద్రరేఖ
బుద్ధిమాలిన చిన్నిపొరపాటు కతమున
    పతమయ్యె నీ కొండవీటిపటిమ
ఉత్సాహయుతమైన యడుగునెత్తుట లేక
    ప్రాకింప లేదు రాష్ట్రధ్వజంబు

పరువుమాలిన నీ యనాదరణకతన
మేటి నీ భాషపాలిమేర దాటలేదు
పసిఁడి జ్ఞానఘనకు సంబరముపడక
కడగి యొత్తును నీ వీగ కాహళంబు.

చీకాకుగోడాల సిగమీఁది పువ్వునై
పొడమె, నీజాతి చెక్కడపుచెణుకు
అరవపాటకుల తంబురకు ప్రాణముపోసి
కులికె, నీ చిన్నారి తెలుఁగు వాణి
హిమపద్గిరిదాఁక జృంభించి పగవాని
తరిమివెన్నాడె, నీ కఱకుటలుగు
మొగలురాజుల సభాభూముల నూరేగ,
నీజగన్నాథ పండితునిపలుకు

ఎందుఁజూచిన నీయశస్స్యందనములు
నడచిపోయిన జాడలిప్పుడునుగలవు
దిక్తటంబులమరల నెత్తింపవోయి
తెలుఁగుమన్నీల పసుపునిగ్గులపతాక.

తెలుగుంగేసరులున్, మహర్షులును, గాంధీశాంతి సేనాపతుల్
గలరాంధ్రప్రముఖుల్ త్వదీయులు భుజస్కంధంబునందింత్రు, నీ
అలఘుశ్రేయము లీనమోయినవి రాష్ట్రార్ధంబు యత్నించి నీ
బలముంగొంచియు మాకళించుకొనరా! ప్రఖ్యాత వీరాంధ్రుడా!

# 8. గోవు

పెరుగుంబాలుఁ ఫలించుచున్ నిరతమున్ విశ్వంబుఁ బోషించు, ని
న్నఱవంగుత్తుకఁ గోయు దాయలకు ద్రవ్యాశన్ సమర్పించు, ము
ష్కరులన్ గొమ్ముఁల జిమ్మవేమిటికి? స్వచ్ఛంబైన నీ వెన్నతో
విరచింపం బడెనేమొ నీమనసు దేవి! ఆవు ముత్తైదువా!

నికటక్షోణుల జెంగనాలనిడునా నీకూర్మి బిడ్డండు, కా
టుకకన్నుల్గల కోడెగాడ నల దుష్టుల్ నిన్ను పాలార్చు చే
తకుఁ జింతింపవు కోపగింపవు, విచిత్రంబమ్మ! మీమాతృ పు
త్రికాసంబంధము, లోకపావన చరిత్రా! ధేనుమాణిక్యమా!

అడవిం బెబ్బులి నీతనూరుధిర మాహారించునే కాని, మీ
గడయున్నీ నవనీతమున్ గుడువ నాకాంక్షింప దెన్నండు, నీ
విడు, సర్వస్వము నారగించుచు కృపాహీనమ్ములై వారకం
బడరంమాలు నినున్ వధించెడు మనుష్యవ్యాఘ్రముల్ క్రూరముల్

అసువుల్ నిల్పెదవమ్మ! బిడ్డలకు క్షీరాహార మర్పించి, నీ
నిసువుల్ పస్తులుఁ జేయ, నీ ఋణమునన్ దిక్చక్రముల్ బ్రుంగెడిన్
బసరాలన్ రతనంబవైన నిను సన్మానింపఁ బండించు ని
ప్పసుపుం గుంకుమచాలునా? గుణకదంబా! ధేనుకాంతామణీ!

గజ్జెలు మువ్వలున్ జిగురు
కంఠమునం జెలువార' గన్నులన్
గజ్జలరేఖ ముద్దులొలు
కన్ మురు పచ్చల కోడెమాడ, నీ

పజ్జ నటింప నీ వెవని పంచ
నసింతువో, వాని యింట సం
పజ్జల జాలుకోచన ని
వాసము సేయు నిజంబు నెచికీ!

కనణ మాహరించి, కమ్మని దుగ్ధంబు
భువనముల కొసంగు పూజ్యురాలు
చంపువాని నమ్మి చనుదెంచు వెఱ్ఱిది
ఆవుతల్లి! యసువు లడచునాక

అసువు లేవాక యంభారావ మాలించి
పొదుగున దుగ్ధంబు పొంగిపోవ,
గరువులలో బచ్చిగడ్డి మేయుటమాని,
తత్తరంబున నింటి దారిబట్టి,
కట్టుగంబంబున నటిటు మల్లాడు
కన్నపుత్రుని యంతికమున నిలిచి,
శిరము చుంబించి హెచ్చిన మోహమున జిన్ని
కొడుకు గుఱ్ఱకు చన్ను గుడుపుకొనుచు,

అట్టినా కెడు నినుగాంచి యాగ్రహించి,
బడియచేబూని దండించు స్వామినరసి,
కలతజెందక తొలగి యచ్చోటకుబోవు
నీదు సహనంబు నాగుండె నిరుసేయు.

ఘసయిగో ముత్రలు, నోగకన్నుల చెడంగున్, స్వచ్ఛమై శారదాం
ంబోలు కోపమున్, బొడుగు పెంపున్ గల్గి, గర్వంబుగా

పదముల్ మెట్టుచు, రాజసంబు తులకింపన్ బొల్చు, నీయందమే
మదిరాక్షీ మఱచికున్నదో తెలుపుమమ్మా! ధేనురంభాంగనా!

నీ పెడకలయంపి నీటమజ్జనమాడి
కలకలలాడని నిలయమేది?
పాపభంజకమైన నీ పంచితంబంటి
సంశుద్ధినందని స్థానమేది?
ప్రియమార నీ పాలు పెరుగు లాహారించి
బొజ్జబెంచని భోగపురుషుఁడేడి?
నీ వెన్నగాచిన నేతి సంగతిగూడి
రుచినేర్చుకొనకున్న పచనమేది?

నీకుమారులు మనుమలు నిన్ననేడు
చెమటలూడ్చని బెత్తెడు క్షేత్రమేది?
కటాకటా! తల్లి! నీరక్త కర్దమమున
నోలలాడని రవ్వంత నేలయేది.

కత్తివేఁబూని నీతల గత్తిరింప
నికటమున నిల్చియున్న హంతకునిజూచి
చెప్పుకొన నోరు లేని నీచిత్తమందు
నెన్నిభావాలు చుట్టలై తన్నుకొనునొ!

నిద్దపుం బెద్దకొమ్మంచు ముద్దబోలి
ముద్దులొలికించు నీదివ్య మూర్తియందు
ఆర్త శిశుపోషకంబైన యభయముద్ర
ప్రతిఫలించెడునమ్మ విస్పష్టముగను

వెలగలయట్టి నీరధర బిందువులెన్ని వ్యయించి పాలుగా
జిలికెడవో కదా? మొదవుచేడియ! నీబలమెల్ల యిమ్మను
ష్యులకిడి, కృద్ధారాలవయి స్రుక్కెదనీకు గటారిపోట లా
ఫలితము! భారతీయుని కృపాపరతంత్రత గొడ్డువోయెనే?

పాళ్ళినిగూర్చికొం డొక మహాకవి కబ్బము వ్రాలి, నిండుచూ
లాలితనంబుతో గరువులందు విహారముసేయు నీ సము
ద్వేలశుభస్వరూప మరవిందనివాసిని కాటపట్టు, నీ
కాలిడునేలకీడగునె? కాశికయున్, గయయున్, బ్రయాగయున్.

కావవచ్చిన, ప్రత్యక్షదైవమట్లు
సత్కరించెదరొక ప్రయోజనముగోరి
నీదు నడుమంతరపు జావు నిలిపివేయఁ
దొడయరొక్కరు, పరమఘాతుకులు నరులు.

'ఆత్మవత్సర్వభూతాని' యన్ననుడువు
వల్లెవేయుదు రది నోటి జొల్లువోవ
దీనియాథార్థ్య మెపుడేని తేల్చిచెప్ప
యోగ్యురాలవు నీవు నోరుండునెడల.

నీకునెత్తురు మాంసమున్నటులగానీ' జీవమున్నట్లుగా
నీ కొసంత తలంతురో తలపరో యీమాంసభుక్కుల్, నరుల్,
రాకాసుల్, నిను జేతనా రహిత యంత్రంబట్లు గావింతురో
గోకల్యాణి! శిలోచ్చయంబులు కరంగున్ నీయభాగ్యాప్తికిన్.

తిట్టిన దిట్టవు కొట్టిన
గొట్టవు యజమానిమాటకుం దిరుగ వహో!
గుట్టుగల సతులపాపట
బొట్టువు నీ సహనగుణ మపూర్వంబు గవీ!
నీ గంగడోలు నందము
నీ గుండ్రని కొమ్ముతీరు నీనడ బెడగున్
వేగైనహొదుగు కుదురున్
నీ గిట్టలసొగసు ప్రేక్షణీయములుగదా?
ఇచ్చెదవుగాని క్రమ్మర
బుచ్చుకొనవు ప్రతిఫలంబు. పుల్సెనీరున్
బచ్చికదిని జీవింతువు
సచ్చరితవు నిన్నువంటి జంతువుగలదే?

## 9 వ్యాప్తి

మనసంస్కృతి, మనసభ్యత
మనవిజ్ఞానంబు బహుళమర్యాదలతో
వననిధులు దాటియున్నది
తెనుగుం గవళికలు లేని దేశముగలదే!

అటుజావా, యిటు సింహళంబువఱకున్ వ్యాపించి, భీమంబుగా నటకాయించు శతాబ్దమాలికలచే నట్టిట్టుగా, కుగ్ర సంకటముల్ దాటి, క్షణక్షణోజ్వలకళా కాంతుల్ జలాయించుచు, విస్ఫుటదివ్యాంధ్రవిశాల నాగరతకున జోహారు గావించెదన్.

ఊరేగెన్ దోలి రెడ్డిరాజులజగాయొడ్డోలగంబందు బం
గారుం జేకుల గొండవీటి వెలుఁగుం గల్యాణి, శ్రీనాథుఁడ
య్యెఱ్ఱాప్రెగ్గడయున్ మెఱుంగులిడఁగా, యేభాషకున్ లేని యా
య్యాగంబున్ గులుకున్నడల్గలవు సత్యం బాంధ్రవాగ్దేవికిన్.

---

## 10. మేఘుఁడు

ఏను గుపిల్లమాదిరి మహీధరశృంగ మలంకరించి, నె
మ్మేని నిసుమంతలో బెనిచి, మింటిని కౌఁగిటఁబట్టి, బ్రాహిత
ధ్యానము లాచరించు నవవర్ష పయోధర! భేకసంఘముల్
గానము చేయుచున్నవి, జగంబున నింపుము కుంభవర్షముల్.

మద్దెలకాఁడు నీ హృదయమధ్యమునన్ నివసింపకున్న నీ
గద్దరి గర్జనధ్వనులు గల్గుట కేమికతంబు? చెల్వమున్
ముద్దులు మూటకట్టు నగుమోము తళుక్కునఁజూపి డాగు న
మ్ముద్దియలెల్ల నీ యనుఁగు పుత్రికలేకదరా? వలాహకా!

---

## 11. గుసగుసలు

ఇరువురు క్రైస్తవ భక్తులు
నిరతము వేదాంతఘన వనీవనములలో,
దిరిగెడువారొక పల్లియఁ
బరమ రహస్యములు కొన్ని ప్రకటించిరిటుల్.

బాటచూపగలము స్వర్గలోకమునకు
ప్రేమధనము పంచిపెట్టగలము
మామతంబునమ్మి మా వెంటబడిరండు
మీకుముక్తిగల్గు లోకులార!

సోదరులము మనమందరి
మీ దేహములీటిబుకక, యెల్లర మొకచే
లేమ కులంబంతరమని
వేదగ్రంధంబుచదివి పృథుకంఠములన్.

స్తుతికిన్, గాత్రంబునకున్
జతపడనివి, ఛందమునకు జతపడనివి, వా
రతికెంచుకొన్న పాటలు
ముతకవి గానంబుచేసి ముదితాశయులై.

పాపులు వీరెల్లరు నీ
ప్రాపకము లభింపఁజేయవలయునని మన
స్తాపమున కనులుమోడ్చి
పాపము గురుయుగళిమ్రొక్కె భగవంతునకున్.

కొంతయర్థమగుచు కొంతయర్థముగాక
వారిబోధ పల్లెటూరిప్రజకు
తాతవేసికొన్న తాంబూలమునుబోలి
యుబుసుపోకకోస ముపకరించె.

మా క్రీస్తుకన్న మా క్రీస్తుడే
పరమపావనుం డనియెనొకండు
[illegible] మోగాని మనసులోపలభక్తి
బూటకంబని లేచి పోయెనొకండు
కరణాలచదువెల్ల కిడముట్టజదివి నా
రని మనంబున మెచ్చుకొనియెనొకండు
మాలమాదిగలకు మతమున్నదాయంచు
జాతివిద్వేషంబు జరిపెనొకండు

రామసామికన్న సామిలేడనుకొని
మనసుగట్టిజేసి కొనియెనొకండు
చదువుకొన్నమాత్ర జాతిరాగలుగునా
యనుచు కంటగించుకొనియె నొకండు.

ఈసువర్తమాన మిచ్చోటపండించి
యేసు మనకు శుభము లీయగలండు
పోయివత్తమనుచు బోధకులిద్దరు
బోయి రెవరి గూడెములకువారు.

మాలబోధకుండెన్నడో మాదిగింట
గుడిచినాడని యమ్మాలగూడెమునకు
నెడముగానుంచి దాహంబునీయరనుచు
గుసగుసలుగల్గు నిది తెల్చుకొనుటలెస్స.

# 12. మనలో మాట

నిలిపిరే తెలుఁగు మన్నీలు కొండల మీఁద
 జాతీయ విజయ రాష్ట్రధ్వజంబు
మాన్పిరే సుకవి సమ్రాణ్మత్తగజముల
 దరిలేని యాచనాదైన్యవృత్తి
కొమరారునే దివ్య సుమ గుళుచ్ఛములచే
 నాంధ్రవాఙ్మయ మహోద్యానవాటి
పునరుద్ధరించిరే మంటాజమహాలుకు
 పేరుదెచ్చిన శిల్పకారిగరిమ

విజయనగర రాజవీధి దిగ్గజములు
మోసి చన్నకవన భువనరథము
నుజ్వలముగ మరలనూరేగ జేసిరే
మాన్యులార! రిత్తమహము లేల?

కినిసి చనెన్ విశాఖపురికిన్ మనవిశ్వకళాలయంబు, రే
చిన యల దత్తమండలపు జిల్లల నుక్కిరిబిక్కిరై, జగ
జ్జనవినుత ప్రతాపముఖసాహసశక్తులుగల్గు నాంధ్రనం
దనునకు దాపురించెనె క్షణక్షణవర్ష మనైకమత్యమున్.

సరదాగాదుగదా? తెలుంగులకు భాషావేష వైముఖ్య, మీ
వరకే ద్రావిడభూమి బ్రహ్మరథమున్ బట్టెన్ కవిశ్రేణికిన్,
వెరవుల్ చూపె విగాయక ప్రతతికిన్, నియొక్కపద్యంబుతో
సరిగా వెల్లకవిత్వముల్ తెలుఁగువాఁ! ఆంజనేయప్రభూ!

## 13 ఇంటిగుట్టు

పంచములలోన మాదిగవాఁడ నేను
పంచమీయులలో మాలవాఁ డతండు
ఉభయులము క్రైస్తవమతాన నొదిగినాము
సోదరత గట్టుబాటు గాలేదు మాకు

దేవుడొక్కడు మాకు దేవళంబులు రెండు
దేశమొక్కటి మాకు తెగలు రెండు
మాటవరుస కొక్క మతమందుమే కాని
కుల సమస్యవద్ద కుమ్ము దుమ్ము.

వాని నేను నన్న వాఁడు నన్న పడజాల
మితరులెవ్వరన్న నేమి లేదు
మాకు సంధిసేయు మాటెత్తదని కాని
మతము నేని మేము మానఁగలము.

మాల యేసుక్రీస్తు మాదిగలకుగాఁడు
మాదిగేసుక్రీస్తు మాలగాఁడు
ఒకడు చిలువరించు నొకఁడు స్నానంబిచ్చు
నిరువురేకమగుట కేదిదారి

వాని గుడిసెమీఁద వాలిన కాకి, నా
గుడిసెమీఁద వాలఁగూడ దెపుడు.
కాకులందు మాలకాకి మాదిగకాకి
రూఢిసేయు మా విరోధములను

హిందువులను మూచి యెగతాళి చేసెర
ఇంటనున్న మురికి కేవగింప
మొరుల తప్పిదంబు లోరుసుకొన లేము
సొంతతప్పుమాకు చురుకు లేదు.

మతములో నొకింత మాటపొత్తేకాని
పొత్తు లేదు మాకు పొరుగు లేదు
సిగ్గువిడిచి హెచ్చు తగ్గులకోసమై
తన్నుకొంట మాకు తప్పు లేదు.

చదువువల్ల పగలు సద్దుబాటగునందు
సీమదొరలు చదువ చెప్పిరారు
కచ్చేరిలకెక్కి గబ్బు గబ్బైనాము
చదువు మందుగాడు జాతి రుజకు

అంటరానితనపు టడుసులో బొరలాడు
పేదవార మండ్రేదుమాకు,
మా కులాల గొడవ మానుంచి మీలోన
గలుపుకొనుడు సుగుణ జలధులార

మమ్ముజూచి మాదుమాట పొందికజూచి
నడకజూచి యొడ్డు పొడవుచూచి
ఎవరు గొప్పవారొ! ఎవరు తక్కువవారొ!
తేలబలుకుడయ్యా! ధీరులార!

---

# 14. జిజాబాయి

కన్నా శాత్రవసర్వ భేదనము సేయ న్నిన్ను వెన్నాడి వ
చ్చున్నాతల్లి భవాని! నీకఱకు విచ్చుఁగత్తిపైనుండు, ధా
త్రిన్నాదివ్య పతివ్రతాత్వమున వ్యర్థీభూతమౌగాక, నీ
యన్నన్ జంపిన వానిదోర్బలము పుత్రా! గెల్పునీదేసుమీ.

వైరి నెత్తురిబొట్టు వదనాబ్జమున గ్రాల
ముదమార తిరిగి వచ్చెదవుగాక
తినిపించెదవుగాక యినుపకత్తులకీవు
ముదురు కందనగాయ భోజనంబు
త్రావించెదవుగాక దండి బల్లెములకు
పరులక్రొవ్వాడి నెత్తురుల తేనె
కీలించెదవుగాక గెలుపు జెండాపూలు
కంచుకోటల మసకములమీఁద

స్వర్గమునుండి యన్న శంభాజి నీకుఁ
గుసుమకింజల్క వర్షంబు గురియుగాక
భరత జనయిత్రి, మోద బాష్పములు విడిచి
చేరి మనిను దెచ్చి నాకు నర్పించుగాక

నీయఁగ సింహవాహనము, నీ కరవాలము శంబురాణి, దీ
ర్ఘాయువు నీకు నా సలిపినట్టి నిరంతర పూజనంబు, నీ
ఛాయల గర్భ పిండములు ధారుణికూల్చి నటింపుమన్న! రా
ధేయుఁడవై, కిరీటివయి, దేవనదీతనయుండవై, సుతా!

వేడిమి వీడకున్న రిపువీరుని నెత్తురుబొట్లు గ్రక్కు క్రొ
వ్వాడి కటారితో తిరిగివచ్చు కుమారుని జూచి నవ్వు దొ
ల్కాడ జిగా సుమంగళి రయంబున బోయి కవుంగిలించి, ము
ద్దాడి, ముదశ్రుపూరముల నాతనికిన్ దలయంటె నత్తఱిన్.

---

## 15. నేటి కైత

కవితావాహిని చీలి పాయలయి అగంబై యథేచ్ఛారతిన్
ప్రవహింపందొడగెన్ బురాతనపు త్రోవల్పుంతలుం బాసి వ
డ్డవి, ఛందోనియమాది కూలములు భ్రష్టంబయ్యె నీమందు వే
సవియంగాంచునొ! సంగమించునొ! రస స్వర్గీయ పాథోనిధిన్.

ముసిరిన భావజాలమును బూడిదలోపలఁ బుంపి, కుత్తుకల్
బిసికి, యగాధ శబ్ద వనవీథులఁదాచి, కవిత్వమన్నచో
విసిగి, శపి చిపోయెదరు, వీనులు శూన్యములై సభ సదుల్
రస మరికట్టు యీ గులకఱాల బిగుంపుల కేమి హేతువో.

మొత్తముమీఁద నాంధ్రకవి ముఖ్యులు పెట్టినకట్టుబాట్లలో
నుత్తమ మధ్యమాధమము లున్నవి, వానిని కొద్దిగా మరా
మత్తొనరింపనౌ ననెడు మాటకు నేనును సమ్మతింతు, నీ
బిత్తల త్రోఁవబీకుడు కవిత్వపు ఫక్కి ననాదరించెదన్.

---

# 16. సుభాసు బోసు

బందీవై, పహారాజవానుల కనుల్ బంధించి, యేరీతిగా
హిందూమాతను వాసి, వాలితి జపాన్ పృథ్వీన్ మహావీర! ఖా
మందుల్ నీకుదారల్ తలంచిరి జగన్మాన్య ప్రతాపారణీ!
యెందున్నావు! గతింపలేదు గద తండ్రీ! బోసువీరాగ్రణీ!

స్వాగతమిచ్చెనే! పొగరు వట్టిన పొట్టిజపానుభూమి నీ
యాగమనంబుజూచి యవురా! పరరాజుల గడ్డ నీ మహా
త్యాగము నాకళించినది, దైవతశక్తులు గల్గు నస్త్ర శ
స్త్రాగమవేది! చూచితనవా? యొకమారైనను గన్నదేశమున్.

ఈడుం జోడును లేని నీవచనవహ్నిజ్వాలచే యెందరో
యాడంగుల్, కరవాల పాణులయి సైన్యాధీశులై లేచి, నీ
నీడన్నిల్చిరి! విశ్వవీరుడవురా! నేతాజి వీరాగ్రణీ!
యేడున్నేడగు లోకముల్ కుమిలిపోయె న్నీవియోగంబునన్.

ఆరని నిప్పుముద్దలటు లాస్యబిలంబున నిర్గమించు, నీ
వీరరసోక్తి మాలికలు విశ్వములన్ దహియించునంచు కం
గారయినాడు గాంధిముని, కన్నుల నీరిడుచున్నవాడు నే
డో రణరంగభార్గవ! సముజ్వలరత్నము జారిపోవుటన్.

ఆసల్ లేవుగదన్న భారతికి నీయాకారముం జూచి, నీ
యాసుల్ వీనులవిందుగా వినగ, నె ట్లోదారుపుం జెందునో,
ఓ సూర్యప్రతిమాన తేజ! దయలేదో! దర్శనంబీయవో!
బోసూ! సద్విజయోస్తు నీ ప్రతిభకున్ పూజ్యప్రతాపాగ్నికిన్.

కులుకులకొప్పులో ముడిచి కొన్నది భారతి నీ యశస్సు, నీ
తళుకుల ఖడ్గరాజమునుదాల్చి తిరించినదన్న జాపనీ
ప్రళయము, తల్లిసేవకు ఋణపడ్డది, బోసుమహానుభావ, నీ
చెలిమిని చూఅలాడెడు నసీబమరెన్ జపనీయసీమకున్.

పరమపదింపలేదు మనబాబు సుభాసనుమాట దిగ్గిగం
తరములమ్రోగుచున్నది యథార్థముకాదుగదా ? సుభాసుభా
స్కర ! యుదయింపవే భరతఖండము కోటికరాలపూజ నీ
కొరకు తయారౌ చేయుకొమ్మ క్రమానస్యము సింహనాదమున్.

కాబూల్ బాబుపలెం దహారిఖ. సిజాగారంబువోనాడి, నీ
వైబైరాగిమురాలలోగలసి, యేయే కష్టముల్ దాటి, య
క్కాబూల్ భూములు నిర్గమించి జపనీగడ్డం బ్రవేశించితో !
బాబూ ! బ్రహ్మకెఱుంగరానియవి నీ ప్రస్థానిక వ్యూహముల్

పరుగులెత్తెనుగదా పగవారిగుండెలో
ప్రతిలేనివెఱపు గుఱ్ఱపురథాలు
ప్రవహించె బహువీర భగతపుత్రులమేన
దహలిన పూర్వప్రతాపగంగ
పుష్పించె బంగారు పూలరేకులమీద
నగారి నీ మధుర నామాక్షరములు
హుంకరించినది దివ్యులు పూలువర్షింప
సమరరంగమున నజాదుపౌజు

యున్నయటులుండి చెరసాలను త్రెంచి
యుగ్రరణరంగమున శంఖమొత్తినిలిచి

మెరసి మొలకెత్తు నీ కోరమీసములకు
వందనసహస్రములు బోసుబాబువీర!

కొండాడె నిన్ను దేశదేశములు యుక్కుందునక్కయై, నీ యజా
ద్దండెత్తించె స్వతంత్రభారతపవిత్రోచ్చండముల్ జాళువా
జెండాల్, దండి తుషారపర్వత శిరస్సీమన్, పిశంగచ్ఛవుల్
నిండారెన్ నుతికంది చాపులకు రానేరావు నీపగ్గియల్.

అదిగో! నీవు తయారుజేసిన యగణ్యంబైన సైన్యంబు మా
కొదవెన్ ధైర్యము, వీడిపోయినవి యుక్కున్ బంధముల్, నేటికిశ
వృదికోట్లై తగు నీసహోదరులకున్ శౌర్యంబు సృష్టించు, నీ
కిదిగో, మా నిజరక్తపూజ రణవేదీ! బోసువీరాగ్రణీ!

## 17. భట్టుమూర్తి

అంతము గానరాని బహుళాద్భుత సత్కవితాప్రపంచ మా
వంత చలించునోయను భయంబున రాయలు నిల్పినట్ట ది
గ్దంతులలోన చెప్పుకొనగా దగు శ్లేష కవిత్వచండ భా
స్వంతుడ వీ వహో! సరస భట్టుకవీ! కవితాకళానిధీ!

దాటవశంబుగాని కవితా నియమోన్నత భిత్తికల్ నిరా
ఘాటజవంబున న్నెగసి గంతులువెట్టెడు నీదు శ్లేష వా
గ్ఘాటికి పెద్దనాదికవి దంతులు తత్తర మందలేదె, యా
నాటికి నేటికింక నొకనాటికి నీ కెదురేరి సత్కవీ.

“కాపు కవిత్వమెవ్వారికిఁ గమ్మదనం బగునంచు” నెన్నియో
లోపము లెన్ని నిన్ను సభలో నవమానముసేయు లింగసీ
గోపముసేయ కింక ననుకొమ్మని చక్కదనాల కబ్బపుం
గాపులు గాచిపోయితివిగా కవితా దివిజద్రుమంబునన్.

## 18. నీలిమబ్బులు

గాలికి సాగి యుత్తరముగా పయనించెదు నీలిమబ్బ! తీ
నేలకు సిగ్గు లేదనుచు నింద యొనర్తువు కర్షకోత్తమా!
వేలవు, మాయమబ్బులవి భీరులబాలుర బుగ్గిజేసి బౌ
ద్ధాలయ గర్భముల్ కలచియాడు జపానులబాంబు క్రొంబొగల్.

గౌతము బుద్ధదేవుని మొగంబున నెత్తురుబొట్టులే దహిం
సా[illegible]రుమంత్ర రాజము ప్రచారముచేసిన చోట రక్త మం
దీతలు కొట్టెడిన్ బ్రళయ మృత్యువు, దానిభయంకరాట్టహా
సాతత కాంతులే మెఱపులై కనుపట్టెడి నిజ కర్షకా!

హేయపు నల్లమందు కయిపెక్కి యొకానొకనాడు తొంటి చీ
నాయువకుండు కట్టుకొనినా డుడివోవని పిచ్చిగోడ, నీ
వాయు విమానదాడుల జపాను తుపాకుల భిన్నభిన్నమై
పోయెడు భిత్తికా శకలముల్ గదరా! పిడుగుం బరంపరల్.



# 19. చెలికాడా

పెనతెనముస నెరువురమును
వినుకొండ పురానగలసి విహరించి నీ
కనకమయ మధుర రూపము
కనులమోలగు మసక మసకగా నవనవగా

కవినై వచ్చితి నీసమాధికడకున్, గన్పట్టవయ్యెంగదా?
భవదీయామృత రూపధేయము, పరబ్రహ్మమ్మునం దైక్యమై
తివా! సృష్టింజతియించి పోయితివా? నీదేహంబదే పుష్పమై
యవతారించినదో! తిమోతి! చెలికాడా! మందభాగ్యోదయా!

ఏ పల్లవంబనై రూపంది నను చూచి
చిరునవ్వుతో సైగ చేసినావా!
ఏ దివ్యరత్నంబనై దృష్టికందక
యెందుండి యారతులెత్తినావా!
ఏ నాలి గాన్పులో నిమిడి నాకెదురే
దెంచి మక్కువ గౌఁగిలించినావా!
ఏ పుట్టతేనవై, ఏ చెట్టునందుండి
యుంపార నాకర్ఘ్యమిచ్చినావా!

మాయకాపాంబువులలోన మర్మరించు
కరుణ కిరవైన యలనాటి మరణగాథ
చెలిమిమై యే విహంగ కూజితముతోడ
చెప్పుకొన్నావో! నాతోడ చెలిమికాడ!